# భారతి

1967 మే



నిప్పుకోడి

శ్రీ పెద్దిభొట్ల సుబ్బరామయ్య

1984 లో ప్రపంచ పద్ధతి:
మేధావుల ఊహాపోహ

శ్రీ జాన్ డేవి




దేవుడి స్వప్నం

శ్రీ పి. కుమారస్వామి



వ్యవస్థాపకులు

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

---

వెల ఒకరూపాయి

# భారతి

మాసపత్రిక



సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్





మే 1967



సంపుటము 44 : : సంచిక 5 :

విడిప్రతి వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## మే 1967



---

# నిర్వేదము

డా॥ బొడ్డుపల్లి పురుషోత్తం

ఏమని విన్నవింతు పరమేశ్వర !
        దైన్యము నోర్వజాల నో
స్వామి! మదీయ చిత్తమున
        బానిన భావము రూపు మాపి, స్వే
చ్ఛామయ వృత్తి జీవనము
        సల్పెడి మార్గము చూపుమయ్య; నే
నే మెయినైన నీదు ఋణ
        మీయగ యత్న మొనర్తునో ప్రభూ!!

వెన్నెలకంటె మంజులము
        వెన్నను మించిన మార్దవమ్మునన్
సన్నుతి పాత్రమౌ హృదయ
        సంపదకున్ నిలయమ్ము నీవుగా
నెన్నికసేసి నట్టినను
        నీగతి వేసట పాలు సేయగా
మన్నన మార్గమౌనె?
        దయమాలుట నీకును ధర్మమా? ప్రభూ !!

తండ్రివి నీ వటంచును
        ముదమ్మున నీయొడిఁ జేరనుబ్బెదన్
తండ్రివి నీ వటంచును
        హృదంతర వాంఛల వెల్లఁదెల్పెదన్
తండ్రివి నీవటంచును
        యథార్థ మనఃస్థితి విన్నవించెదన్
తండ్రివి తండ్రి వంచు
        దరిదాపులఁ జేరగ దూరమౌదువా?

జీవిత మంత యాతనలఁ
బిక్కి కృశించి నశించిపోయినన్
నీవు చలింపఁ బోవుగద!
నిశ్చల చిత్తుఁడ వన్న ఠాయిగా
వో! విపరీత మానవుల
బుద్ధికి తోచెడి వెఱ్ఱి మొఱ్ఱి సం
భావనలెల్ల సత్యముగ
భాసిలఁ జేయకు మయ్య, మ్రొక్కెదన్॥

ఆకర్ణింపుము నాదు ప్రార్థనల
నయ్యా! నీకుఁ గేల్మోడ్చెదన్
చీకాకై తపియించు జీవునకు
విశ్రాంతిన్ ప్రసాదింపుమా!!
నీ కైంకర్య వినోద లబ్ధరస
నిర్నిద్రైక చిత్తమ్మునన్
నా కాలమ్ము సమస్తమున్ గడుపు
తృష్ణన్ నాకుఁ జేకూర్పుమా!!

అంతకు నంతకున్ హృదయ
మంతయు నిస్పృహ యాక్రమించి, నీ
యంతటి వాని దూరగ
నహంకృతి ముందుకు నెట్టుచుండె, నిం
కెంతటి దాక తాల్మి
వహియింతు? త్వదీయ దయామృతమ్ము ఆ
వంత రుచింపఁ జేయగద
నయ్య! పదేపది కోరనో ప్రభూ!!

అంతయు వర్థమైనది
మహాత్మ! ప్రయోజనమేమిలేదు నీ
యంతటి వాని తోడ,
వివరంతటు వారలు సంచరించు లే
కొంతకు కొంత పేఁ లొనట
గూర్చును: నీ వొక సామి వంచు ని
న్నెంతటి భక్తిఁ గొల్చిన
ఫలింపవు పూజలు: రాళ్ల పాలగున్॥

# నిర్వేదము

నీ వతి ప్రేమమూర్తివని
    నీ పద పద్మము లాశ్రయించు స
న్నీవిధి తప్పఁ జూచుట
    వినీతియు ధర్మము కాదు నీకు, తం
డ్రీ! విపరీత వర్తన
    గడించిన కీర్తి నశించునయ్యా! స
ద్భావ కృపా పరత్వ
    సముదంచిత బుద్ధి ననుగ్రహింపుమా!!

జీవము నా మనమ్మున
    కృశించుచు నున్నది; అల్లనల్ల న
ద్భావ పరంపరల్ యెదను
    బాయుచు నున్నవి; ఇంకనైన సన్
కావగ నీ యెడంద నను
    కంప వహింపవయేని వీని భూ
దేవికి నంకితం బొసగి
    తీరెద; నిల్వ జనాభ లెక్కకై॥

---

# నిప్పుకోడి

శ్రీ పెద్దిభొట్ల సుబ్బరామయ్య

ఉదయం తొమ్మిదిగంట లయింది. ఎండలో చురుకుపాలు హెచ్చింది. రామకోటి తన పాత లాల్చీ జేబుల్లో చేతులుపెట్టుకుని నడుస్తున్నాడు. ఎండలో వేడిమి హెచ్చడంతో అత దను కున్నాడు: 'నా ఆకలిలాగే ఈ ఎండకూ వేరే పనేమీ లేదు...'

ఒక పెద్దహోటలు...రామకోటి అకస్మాత్తుగా ఆగిపోయాడు. హోటలుముందు బోర్డు మీద వ్రాసివున్న అక్షరాలను కూడబలుక్కుంటూ చదివాడు: 'ఇచ్చట అన్నిపదార్థములు శుభ్రమైన వెన్నకాచిన నేతితో తయారు చేయ బడును...'

రామకోటి క్రింది పెదవినీ పళ్లతో నొక్కుతూ మరొక పోస్టరువైపు చూశాడు. అందులో యిద్దరు వస్తాదుల బొమ్మలున్నాయి. ఒకడిది గుండు...రెండోవాడి మెడలో ఒక తాయెత్తు వుంది. వాళ్లిద్దరూ ఛాలెంజీ వస్తాదులు. ఆదివారం సాయంకాలం జరుగబోయే కాటా కుస్తీ పోటీలలో వారిద్దరూ ప్రత్యర్థులు.

'ఇవాళేగా ఆదివారం...తప్పకుండా వెళ్లి చూడాలి...' అనుకున్నాడు రామకోటి.

కాని, యిటువంటి ఇతర ఆలోచనలతో ఆకలిని మరిచిపోదామని అతడు చేసే ప్రయత్నాలు బొత్తిగా ఫలించడంలేదు. ఇప్పుడూ అంతే అయింది. అతని లాల్చీ జేబులో ఎంత వున్నదో అతనికి తెలుసు. అతడు బడ్డీకొట్టు పక్కకు తప్పుకుని జేబులో పైసలన్నీ యివతలికి తీసి లెక్కపెట్టుకున్నాడు. ఎన్నిసార్లు లెక్కపెట్టినా ముప్పయిపైసలే...డబ్బులు పిల్లలను పెట్టవుకదా!

అతడు పైసలను గుప్పిటలో వుంచుకుని హోటల్లోకి వెళ్లాడు. లోపల ఎక్కడా ఖాళీలేదు. జనం తినేవాళ్లు తింటూవుంటే 'వాళ్ళెప్పుడు లేస్తారా' అని కాచుకుని వున్నవాళ్ళూ వున్నారు. అందరి ముఖాలలోనూ ఆకలి...ఆకలి...

అత డొకచోట కూర్చున్నాడు. అతని కెదురుగా యిద్దరు యువకులు కూర్చుని వున్నారు. వారిలో ఒకడు తాళాలగుత్తిని చేతి వ్రేలికి చుట్టుకుని గిరగిరా తిప్పుతున్నాడు. రెండో యువకుడు ఉండిఉండి ముఖం తుడుచుకుంటున్నాడు. ఉన్నట్టుండి మొదటి యువకుడు ఒక విట్టు వేశాడు. రెండో యువకుడు నవ్వాడు. ఒక్కక్షణం తర్వాత మొదటి యువకుడు ఏమీ తోచనివాడిలా జేబులోనుంచి పర్సు తీసి డబ్బు లెక్కపెట్టడం ప్రారంభించాడు. అయిదు పది రూపాయలనోట్లూ, ఒక అయిదు రూపాయలనోటూ...రెండోయువకుడు 'మొన్ననే కదురా యింటినుంచి మనియార్డరు వచ్చింది? మిగిలిందంతా ఏంచేశావు?' అని అడిగాడు. మొదటి యువకుడు నవ్వాడేకాని ఏమీ బదులు చెప్పలేదు.

యాభైఅయిదు రూపాయలు! ఇరవై రోజుల క్రిందట రామకోటి చేతికి వూళ్ళో మార్వాడీ సరిగ్గా అంతే మొత్తం యిచ్చాడు. అతని చేతిమీదుగా చెల్లిపోయిన చివరి మెడలు అది...ఎన్నోయేళ్ల క్రిందట విజయనగరంలో జరిగిన పోటీలలో నాలుగోవాడిగా వచ్చినందుకు

తనకు లభించిన మెడలు అది...మొదట్లో దాన్ని తానెంత ప్రాణప్రదంగా చూసుకునేవాడు! ఇప్పటికి అన్నిటివలెనే దానికి కాళ్ళు వచ్చాయి.

సర్వరు వచ్చి నీళ్ళగ్లాసులు చప్పుడు చేస్తూ బల్లమీద వుంచి 'ఏంకావాలి?' అని అడిగాడు.

మొదటి యువకుడు 'నాకు చాలా ఆకలిగా వుంది. రాత్రికూడా ఏమీ తినలేదు...' అంటూ ఏవో రెండు పదార్థాలు తెమ్మన్నాడు.

రామకోటి రెండు వ్రేళ్ళు చూపించి 'ఇడ్లీ' అన్నాడు.

'రెండిడ్లీలు!' అసలే పూతరేకుల్లా గాలి వీస్తే ఎగిరిపోయేట్లు వుంటాయవి. లోపల ఆకలి మాత్రం విపరీతంగా చెలరేగుతున్నది. రెండిడ్లీలు ఏ మూలకు? అతడు చాలా ఏళ్ళ క్రిందట నెల్లూరులో కాటా కుస్తీలలో పాల్గొనేందుకు వెళ్ళి ఒకానొక సందర్భంలో పందెం కట్టి నాలుగు డజనుల అరటిపళ్ళు తిన్న విషయం గుర్తుకు వచ్చింది.

ఆ శక్తీ, ఉత్సాహమూ తగ్గిపోయి అన్నీ ఉడిగిపోయినా ఆకలిమాత్రం తగ్గలేదు సరి కదా తన దారిద్ర్యంతోపాటు వయస్సుతో పాటు అదికూడా పెరుగుతూ వచ్చింది.

అనుకున్నంతా అయింది. ఈ రెండిడ్లీలూ క్షణంలో నోట్లో కరిగిపోయాయి. ఇరవై పైసలు అయిపోయింది. పైగా దీనిమూలంగా సుప్త క్షుధాగ్ని జ్వాలలు మరింత విజృంభించాయి. మరొక ఇడ్లీ తెమ్మనిచెప్పి అతడు దిగులుగా కూర్చున్నాడు. పైసల నొక చేతిలో నుంచి మరొక చేతిలోకి మార్చుకుని సుదురు పట్టుకుని కూర్చుండిపోయాడు.

ఎదుటి యువకులలో మొదటి వాడు చెయ్యి కడుక్కునివచ్చి రెండో అతనితో 'అమ్మ బాబోయ్! నే నిక ఏమీ తినలేను. నాకేమీ వొద్దు' అంటున్నాడు.

రామకోటి అప్రయత్నంగా 'అదేమిటి బాబూ! ఇందాక ఆకలిగా వుందంటివే. ఇదేనా నీ ఆకలి? నీ వయస్సులో నేను ఎంత తిండి తినేవాణ్ణి! ఇప్పుడీ హోటళ్లలో డబ్బు లెక్కే తప్ప తిండి లెక్కేమున్నది? రూపాయలు అయిపోవడం తప్ప కడుపు నిండుతుందా ఏమన్నానా?' అన్నాడు.

ఆ యువకు లిద్దరూ రామకోటి చొరవకు ముందు ఆశ్చర్యపోయినట్టున్నారు. తరువాత ఆ యువకుల పెదవులమీద దరహాసం చూసిన రామకోటి మళ్లీ 'అవునండీ! మీ వయస్సులో నా కెంత తిండిపుష్టి వుండేది! నా కిప్పుడు అరవైయేళ్ళు నిండాయి. ఇప్పటికీ ఉన్నపాటున నలభై జతల ఇడ్లీలు తినగలను...' అన్నాడు.

మొదటి యువకుడు గడుసువాడు. అతడు నవ్వి 'సరే.. ఇప్పుడు నలభై ప్లేట్ల ఇడ్లీలు తినండి...పందెం ఏమీలేదు. మీరు గెలిస్తే ఆ బిల్లు నేనే చెల్లిస్తాను. మీరు ఓడిపోతే—అంటే నలభై ప్లేట్లూ ఖాళీచెయ్యలేకపోతే—నేను నయాపైసాకూడా యివ్వను. అప్పుడా బిల్లు మీరిచ్చుకోవలసిందే...సరేనా?' అన్నాడు. రెండో యువకుడు ఇందాక తాను మిత్రుణ్ణి అడిగిన ప్రశ్నకు సమాధానం తెలిసినవాడిలా ముఖం పెట్టాడు. అతనికి హుషారు హెచ్చింది. రామకోటివంక నిశితంగా చూశాడు. మెడమీద చిరుగుపట్టిన పాత లాల్చీ, అడ్డకట్టు లుంగీ, లావుపాటి బెల్టూ, బుంగమీసాలూ అతని దృష్టి నాకర్షించాయి.

రామకోటి కళ్లు మెరిశాయి. తల వూపి 'సరే' అన్నాడు. ఈ వ్యవహారం చుట్టుప్రక్కల వారినికూడా ఆకర్షించింది. అప్పటికే జనం ఆ బల్లచుట్టూ చేరడం ప్రారంభించారు.

సర్వరు పెద్ద ట్రేలో ఇడ్లీ ప్లేట్లు పట్టుకు

వచ్చి బల్లనిండా పరిచాడు. అటూ యిటూ తిరుగుతూ వుండే హోటలు సూపర్ వైజరు—పచ్చనివాడొకడు—'అక్కడ జనం మూగివున్నా రేమిటా?' అని చూడవచ్చి తానూ అక్కడే నిలబడిపోయాడు.

రామకోటి నవ్వుతూ అంతటినీ తేలికగా తీసుకున్నాడు. తర్వాత త్వరత్వరగా తినడం ప్రారంభించాడు. చుట్టూ చేరిన జనం కళ్లు పెద్దవిచేసుకుని ఉత్కంఠతో చూస్తూవుండగా అతడు వెంటవెంటనే ప్లేట్లు ఖాళీచెయ్యడం ప్రారంభిచాడు.

క్రమంగా చుట్టూ జనం ఎక్కువయినారు. కొత్తగా వచ్చినవాళ్లు అక్కడ అంతకుముందు నిలబడి వున్నవారిని 'ఏమిటది?' అని ప్రశ్నిస్తున్నారు.

'ఆ మీసాల ముసలాయన నలభై జతల ఇడ్లీలు తింటానని పందెం కాశాడు.'

'పందెం ఎంత?'

'వేరే పందెం ఏమీలేదు. ముసలాయన అన్నీ తినగలిగితే ఆ బిల్లు అవతలివాళ్ళు చెల్లించేట్టు....తినలేకపోతే ఆయనే యిచ్చుకునేట్టు ...'

'నలభై జతల ఇడ్లీలతో పందెమా? నా చిన్నతనంలో వంద రూపాయలు పందెంకట్టి ఒక అరటిపళ్లగెల అంతా తిన్నాడొకడు.'

'నిజమే. ఈమాత్రపు దానికి పందెం ఎందుకు? ఈ తిండి మామూలుగా తినేవాళ్లు కరవదిలో లెక్కలేనంత మంది ఉన్నారు. రెండు రోజులు ఉపవాసం చేస్తే మనమూ తినవచ్చు...'

'భలేవాడివే....నువ్వా తినేది? దోకులూ విరేచనాలూ పట్టుకుని 'ధామ్మ'ని చస్తావు....'

'గామా ఒకసారి మొత్తం మేకనే తినేశాట్ట....'

'ఇప్పుడింతకీ ఈ ముసలాయన మొత్తం తినగలడంటావా?'

'చూస్తాంగా....'

మొత్తం ముప్పయి ఖాళీప్లేట్లు లెక్కకు వచ్చాయి. మళ్లీ సర్వరు పది ప్లేట్లు తెచ్చి పెట్టాడు. రామకోటి ఆ కొద్దిక్షణాల విరామంలో మీసాలు తుడుచుకున్నాడు. అంతలోనే అతని ముందు పది ప్లేట్లూ కనిపించాయి. అతనికి లోపల కొంచెంగా దడ బయలుదేరింది. ఇప్పటికే కడుపు పూర్తిగా నిండిపోయింది. నీళ్లు తాగితే ఖాళీ వస్తుందేమో! అయినా ఎక్కువ నీళ్లు తాగకూడదు. అప్పుడు వ్యవహారం మొత్తం అడ్డం తిరుగుతుంది. అందువల్ల ఒక్క గుక్కెడునీళ్లు తాగాడు. కొంచెం ఫరవాలేదనిపించింది. మరో ప్లేటు ముందుకు లాక్కున్నాడు.

ఆ యువకుడు చేతి చూపుడు వ్రేలితో తాళంచెవులగుత్తిని గిరగిరా తిప్పుతూ అలాగే కూర్చున్నాడు. అతని తీక్షమైన చూపులకు రామకోటి కళ్లలో ఆదుర్దా తెలిసే వుండాలి. అందువల్లనే అతని పెదవులమీద చిరునవ్వు ఉదయించింది. రెండో యువకుడు జేబు రుమాలుతో ముఖం మాటిమాటికీ తుడుచుకుంటూ అలాగే కూర్చున్నాడు.

'ఇంకెన్ని వున్నాయి?' అని అడిగారెవరో జనంలోనుంచి.

'అయిదు జతలు....' అని సమాధానం వినవచ్చింది.

రామకోటి కళ్లకు ఆ చివరి పది యిడ్లీలూ పెద్దపెద్ద కుడుముల్లాగా, దిబ్బరొట్టెల్లాగా కనిపిస్తున్నాయి. అయినా ఈ హోటళ్ల వాళ్లు యింతంత పెద్ద ఇడ్లీలు చేస్తారెందుకో! వీటినే తా నింతకుముందు పూతరేకుల్లా, గాలి వీనురుకు ఎగిరిపోయేలా వున్నాయని భ్రమపడ్డా . అతని మనసులో భయం బయలుదేరింది. కళ్ల

మూసుకుని తింటూనే మనసులో లెక్కవేసు కున్నాడు. తాను ఓడిపోతే ఎంత యివ్వ వలసివస్తుందో ఆలోచించాడు...అంతలో అతని గుండెలు దడదడ లాడాయి. జరగబోయేది తలుచుకుంటే నిలువెల్లా వొణుకు పుట్టుకుని వస్తున్నది. తాను ఓడిపోతే దాదాపు ముప్పయిఎనిమిది ప్లేట్ల ఇడ్లీలకు సొమ్ము చెల్లించ వలసివస్తుంది. తన దగ్గరున్నవి ముప్పయి పైసలు...తాను బయటపడిపోవలసి వస్తుంది. నలుగురిలోనూ తలవంపులు... అవమానం... అందరూ తనను అసహ్యంతో దొంగను చూసి నట్టు, మోసగాణ్ణి చూసినట్టు చూస్తారు. ఒక వేళ తాను ప్రాధేయపడి అడిగినా ఆ కుర్రవాడు 'ససేమిరా వీల్లేదంటే?...హోటలు దూరు కుంటాడా? ఇటువంటి సందర్భాలలో చొక్కాలు విప్పించి తీసుకుని పంపిస్తారని తాను విన్నాడు. లేకపోతే తనను లోపల రెండు రోజులపాటు చాకిరీ చెయ్యమనవచ్చు. ఇంత బ్రతుకూ బ్రతికి ఇంత అవమానమా? ఇంత జరిగాక తనకు ఆత్మహత్య తప్ప వేరే శరణం లేదు...

'ఇంక ఒక్క ప్లేటే మిగిలింది...' అంటున్నారెవరో...అది విని కళ్లుతెరిచి చూశాడు రామకోటి. అంతలో అతనికి కొంతంత బలం వచ్చింది. ప్రక్కన నీళ్ళగ్లాసు అందుకుని అర గుక్కెడు మాత్రమే నీళ్లు త్రాగి ఆ చివరి ప్లేటు ముందుకు లాక్కున్నాడు.

'బస్....గెల్చాడు ముసలాయన .... గట్టి వాడే....' అన్నా రెవరో....

రామకోటి చివరి ప్లేటు దూరంగా తోసేసి మళ్లీ కొంచెం నీళ్ళు తాగాడు తర్వాత చేత్తో గొంతు సర్దుకున్నాడు...జనంలో కల కలం...హోటల్ సూపర్‌వైజరు నవ్వుకుంటూ క్లీనర్లను పిలిచి 'రేయ్...ప్లేట్లు తీసేయండి... ఊఁ...' అంటూ హడావిడి చేశాడు. చుట్టూ మూగిన జనం నవ్వుకుంటూ ఎవరి సీట్లలోకి వారు వెళ్లిపోయారు.

ఆ యువకు లిద్దరూ లేచారు. రామకోటికి చేయి అందించాడు మొదటి యువకుడు. రామ కోటి లేచి వారివెంట యివతలికి వచ్చాడు. ఆ యువకుడు బిలు చెల్లించి బయటికి వచ్చి నవ్వుతూ రామకోటి వంక చూశాడు.

రామకోటికి అకస్మాత్తుగా దుఃఖం పొంగి వచ్చింది. అతడెంతగా ప్రయత్నించినా కళ్లలో నీటిపొరను ఆపలేకపోయాడు. అప్రయత్నంగా చేతులు రెండూ జోడించాడు.

వారిద్దరూ వెళ్లిపోయారు. రామకోటి వారిద్దరూ కనుచూపు మేర దాటిపోయేవరకూ చూసి నిట్టూర్చి వెనుదిరిగాడు. ఆ యువకుడి ముఖం...అతని కళ్ళలోని కాంతి...అతని చిరు నవ్వు....రామకోటికి మాటి మాటికి గుర్తు వచ్చాయి.

*　　　*　　　*

కొంచెందూరం నడవగానే అతడు బాగా స్థిమితపడ్డాడు. ఒక బడ్డీ కొట్టుముందు ఆగి పది పైసల బీడీలు కొనుక్కున్నాడు. ప్రక్క నున్న తాటితో ఒక బీడీ అంటించుకుని మిగిలిన వాటిని జేబులో వేసుకుని నెమ్మదిగా పొగ వొదులుతూ యివతలికి రాబోతూవుండగా ఆ బడ్డీ కొట్టువాడు అతన్ని చూసి నవ్వి 'నేను గుర్తున్నానా?' అని అడిగాడు.

రామకోటి కళ్లు పెద్దవిచేసుకుని చూశాడు. ఆ కొట్టుమీది వ్యక్తికి పాతిక సంవత్సరా లుంటాయి. పెద్దపెద్ద కళ్ళు...పచ్చని మనిషి..., ఉంగరాల జుట్టు సన్నగా పొడుగ్గా వున్నాడు. 'నన్నింకా గుర్తుపట్టలేదా?' అన్నట్టు నవ్వు తున్నాడు.

నేను మౌలానా కొడుకుని...'అన్నాడతడు. చివరకు...

రామకోటి అతని సమీపంలోకి వెళ్లి 'మౌలానా కొడుకువా? గుర్తుపట్టలేకపోయాను సుమా? నీ పేరు ఇస్మాయిల్ కదూ? అన్నట్లు మీ నాన్నను చూసి చాలా రోజులైంది... బాగున్నాడా?' అన్నాడు.

ఇస్మాయిల్ దిగులుగా నవ్వుతూ 'మీకు తెలిదేమో! మా నాన్న ఆరేళ్ళ క్రితమే పోయాడు...' అని చెప్పాడు.

రామకోటి నివ్వెరపోయాడు. అతని కళ్లముందు మౌలానా నిలబడినట్లయింది. తనకంటే చిన్నవాడు...మనిషి ఎట్లా వుండేవాడు! కండలు తిరిగిన పచ్చని శరీరమూ, నున్నని గుండూ, మెడలో పులిగోరూ... లంగోటా కట్టి తొడ చరిచి గోదాలోకి దిగితే పెద్దపెద్ద వస్తాదులకు కూడా గుండెలు దడదడ లాడేవి... పెద్దలు సంపాయించిన ఆస్తి వుండేదేమో, మంచితిండి తినేవాడు. నిరంతరం పదిమందినీ చేర్చి వారికి వ్యాయామమూ, కుస్తీలు, పట్లూ పద్ధతులూ నేర్పుతూ వుండేవాడు. కావలిలోనో ఒంగోలులోనో ఒకసారి తమ యిద్దరికీ పోటీ పడింది. ఆ నాడు జనం విరగబడిపోయారు. కుస్తీ జరిగినంతసేపూ జనంలోనుంచి ఒకటే గోల...చప్పట్లూ...ఈలలూ... ఆ నాడు తాను అతనిమీద గెలుపు సాధించినప్పటికీ అది గెలుపు అని తా నెన్నడూ అనుకోలేదు.

ఇస్మాయిల్ ఎవరినో కిళ్లీ చుట్టియిస్తూ చెప్పాడు. 'అప్పటికే ఖర్చు ఎక్కువయిపోయింది. ఇల్లేమో తాకట్టులో వుంది. అవతలి వాళ్ళు కోర్టులో వ్యాజ్యంవేసి గెల్చి యిల్లు నొక్కేయించుకున్నారు. మేమంతా చిన్నపిల్లలం; ఇదుగో...ఇప్పటికి నేనీమాత్రంగా నిలదొక్కుకున్నాను. చెల్లెలి పెళ్లిచేశాను. తమ్ముడు మీకు గుర్తున్నాడో లేదో ఒకసారి మీరు మాయింటికి వస్తే 'మామా మామా' అంటూ వెంటబడ్డాడు. వా డిప్పుడు రైల్వేషెడ్డులో పని చేస్తున్నాడు...'

రామకోటి ప్రతిమవలె నిలబడి విన్నాడు తర్వాత ఉన్నట్టుండి నిట్టూర్చి 'ఆ రోజులే వేరు. ఇప్పుడా హుషారే లేదు. అంతా కుర్రవాళ్ళు చేరారు...ఇవాళ క్లబ్బుగ్రౌండులో కుస్తీ జరుగుతుందని చూశానే ఎక్కడో... వెళ్లాలనే వుంది...మరి టిక్కెట్టు ఎంతో, ఏమిటో...' అన్నాడు.

ఇస్మాయిల్ జేబులోనుంచి టిక్కెట్టు తీసి 'ఇదుగో, నా దగ్గర టిక్కెట్టు కూడా వుంది, కావలిస్తే యిది తీసుకోండి...నేను విడిగా వస్తాను. అక్కడ అంతా నాకు తెలిసినవాళ్లే..' అన్నాడు.

రామకోటి ఆ టిక్కెట్టు అందుకుని జేబులో వుంచుకుని నవ్వి 'నీకూ వుందన్న మాట ఈ పిచ్చి' ...అన్నాడు.

'ఆ వాసన పోదుగా...మాఅమ్మకు ఈ కుస్తీలంటే వొళ్లుమంట. నేనయినా ఆమెకు తెలీకుండా వెళ్లడమే... 'ఆలస్యంగా వచ్చావేంరా? అని అడిగితే 'సినిమాకు వెళ్లవచ్చాన'ని అబద్ధమాడుతూ వుంటాను. ఆమెకు తెలిస్తే గొడవ చేస్తుంది...అన్నాడు ఇస్మాయిల్.

'అయితే వెళ్లొస్తాను...' అన్నాడు రామకోటి నడక సాగిస్తూ.

అతని కిప్పుడు హాయిగావుంది. కూనిరాగం తీస్తూ బీడీ చివరి దమ్ము పీల్చి విసిరి అవతల పడేసి త్వరత్వరగా నడిచాడు. అప్పటికి ఎండలో బాగా వేడిమి హెచ్చినా అతనికి అట్టే బాధాకరంగాలేదు.

* * *

ఆ యింటి యజమాని మంచివాడు. ఇంటి మీద వచ్చే అద్దెలతోనే కాలం వెళ్లబుచ్చవలసి వున్నప్పటికీ ఆయన అద్దెలు విపరీతంగా పెంచలేదు. ఆయనకు ముందూ వెనకా ఎవరూ లేరు. ఆ పెద్ద పెంకుటిల్లు పెద్దలు సంపాయించి

యిచ్చినది. రిటైరయిన తర్వాత వచ్చే ఆనాలుగు రాళ్లతోనూ, యీ అద్దె డబ్బుతోనూ కాలక్షేపం చేస్తున్నాడు. రామకోటి ఆయింటిలో ఒక చిన్న గదిలో చాలాయేళ్లనుంచీ వుంటున్నాడు. గది మధ్యలో ఒకతడికె అడ్డంపెట్టుకొని ఒకభాగం పడకగదిగా రెండోభాగం వంటగదిగా ఉపయోగించుకుంటూ కాలంగడుపుతున్నాడు. ఇరవై రోజులక్రిందట తన మెడల్ అమ్ముకున్నతర్వాత యింటిఅద్దె నాలుగురూపాయలుచొప్పున తాను బాకీపడిన నాలుగునెలలఅద్దె చెల్లించివేశాడు.

ఆగదిలో ఒకఫొటోవుంది. అది రామకోటిని చిన్నతనంనుంచీ అభిమానించి ఆదరించిన రాజాగారిది. ఆయన ఆరునెలలక్రిందట హఠాత్తుగా గుండెఆగి చనిపోయాడు. అంతవరకూ ఆయన రామకోటికి ప్రతినెలా ఏనభైరూపాయల వంతున పంపుతూవుండేవాడు. అందుకే రామకోటి ఎన్నడూ ఏఉద్యోగంకోసమూ ప్రయత్నించకుండా యిన్నాళ్ళూ హాయిగా కాలంగడిపాడు. ఇప్పుడు రాజాగారికొడుకులు వేరుపడి తమనుచూసేందుకు వచ్చిన రామకోటిని గమనించనేలేదు. పైగా నిరసించారుకూడా. వారి ప్రవర్తన, వారికి రామకోటికి పైసాకూడా యివ్వరని చెప్పకచెప్పింది. అతడు వారితోమాట్లాడక తిరిగివచ్చేశాడు.

అతడు తలుపుతెరిచి లోపలికిప్రవేశించి పైనున్నతుండూ, లాల్చీతీసి తడికెమీదికి విసిరి, నడుముకున్న తోలుబెల్టుతీసి దూరంగాపడేసి కుక్కిమంచంలోకూలబడ్డాడు. పక్కవాటాలోఅద్దెకున్న మునిసిపల్ ఆఫీసుప్యూను కూతురు-అయిదేళ్లపిల్ల—పరుగెత్తుకువచ్చింది. ఆపిల్ల పేరు స్వరాజ్యం... దానిపొట్టనిండా ప్రశ్నలే...ఇంట్లో తల్లిని అడిగితే విసుక్కుంటుంది. అందువల్ల ఆపిల్ల తనకు ఏ అనుమానంవచ్చినా రామకోటి దగ్గరికిచేరి వొళ్ళోకూర్చుని తీరికగా సంభాషణ ప్రారంభిస్తుంది.

అవాళ ఆపిల్ల వచ్చీరాగానే "తాతా! మాఅన్నయ్యకేమీతెలీదు. వాడు బడికెళ్లేటప్పుడు ఒకమాట అడిగాను. చెప్పలేకపోయాడు. పైగా కసురుకున్నాడు" అన్నది వొళ్ళోకూర్చుంటూ.

రామకోటి నవ్వి "ఏమిటది?" అని అడిగాడు.

"మరేమో,వాళ్లమనో లేదూ..అదేమనోరము.. అది చెప్పిందికదా, నిప్పుకోడివుంటుందే. అది నిప్పులుతింటుందిట..నిజమేనా మరి?..."

"ఏమో, నాకుతెలీదు.." అన్నాడు రామకోటి. స్వరాజ్యం అదొకరకంగా మొహంపెట్టి "నీకూ తెలీదూ?"అని వూరుకుంది.

రామకోటి ఆలోచనలోపడ్డాడు. అవును. నిప్పుకోడి అనేపేరు దానికెందుకు వచ్చిందో; నిజంగా నిప్పులు తింటుందేమో! లేకపోతే దానికి తనలాగే ఆకలిఎక్కువై ఏదిపడితే అది తింటుందేమో!పావురాళ్లు రాళ్లను తినవూ? అలాగేనేమో!

స్వరాజ్యం ఊరుకోలేదు: "నిప్పులుతింటే గొంతుకాలిపోదూ? ఆ మనో ఎప్పుడూయింతే... అన్నీ అబద్ధాలు చెపుతూవుంటుంది. పైగా వాళ్ళ అన్నయ్య చెప్పాడంటుంది..వాళ్ల అన్నయ్య పెద్దపెద్దపుస్తకాలుచదువుతూవుంటాడు"అన్నది.

రామకోటి ఆ పిల్ల వెళ్లిపోయిన తర్వాత మంచంలో కాళ్ళుజాపుకుని పడుకున్నాడు.అతనికెదురుగా గుమ్మంలోనుంచిచూస్తే పెద్దవేపచెట్టు కనిపిస్తుంది. దానిక్రింద ప్రొద్దుటినుంచీ ఎవరో కొలిమిపెట్టి గిన్నెలకు మాట్లువేస్తూ కళాయివేస్తూ పాటుపడుతున్నారు. పదేళ్ల బక్కచిక్కిన కుర్రవాడొకడు ఆయాసంతో ఒగర్చుతూ కొలిమి త్తిపొత్తుతున్నాడు.

పక్కభాగంలో ఎవరో పేపరు పెద్దగా చదువుతున్నారు. "బీహారులో క్షామం.. ప్రజలు తిండిలేక పడుతున్న ఇక్కట్లకు లెక్కలేదు. బావులలో నీటిచుక్కలేదు...మా విలేఖరి....భూమి నెఱ్ఱెలువిచ్చి భయంకరంగావుంది..,ప్రధాని పర్యటన ప్రజలు ఆకలిగొన్నముఖాలతో చుట్టిముట్టి తమ ఇబ్బందులు చెప్పుకున్నారు. ప్రధానికళ్లలో నీరుతిరిగింది...క్షామప్రాంతంలో ఒకవృద్ధురాలితో సంభాషిస్తున్నదృశ్యం."

నెఱ్ఱెలువిచ్చిన భూమిని రామకోటి ఒకసారెప్పుడో చాలాయేళ్ళక్రిందటచూసాడు. అదేదో, ఒంగోలుకు దూరంగావున్నవూరు. మండువేసవి.

అసలే కరువుకాటకాలకు ఆ ప్రదేశం శాశ్వత స్థావరం. అతడు చనిపోయిన దున్నపోతు నోళ్ళ దాన్ని చూశాడు. దానినోరు భయంకరంగా తెరుచుకునివుంది అటువంటిపగుళ్ళనేలఅంతా..ధరిత్రి అంతా వేయినోళ్ళతో "దాహందాహం" అంటున్నట్టు..మూర్ఛవాడు నీటికోసంనోరుతెరిచినట్టు ..

రామకోటి బలవంతంగా ఆలోచనలు మళ్లించుకున్నాడు. అతని మంచంపక్కనే తడికె మీద చాలా పాతపేపర్లు అంటించాడు. అవన్నీ చాలాఏళ్ళక్రింద టివి.. మద్రాసులో పెద్దఎత్తున జరిగిన కుస్తీపోటీలకు సంబంధించిన బొమ్మలు .. రామకోటి అతిశ్రద్ధగా వాటిని తడికెమీద అంటించాడు.

బొమ్మలో చిన్నసైజుకొండలావున్నాడు కింగ్‌కాంగ్ ..అతని నన్ననితలా, పెద్దశరీరమూ, ఆచూపులూ తలుచుకుంటేనే అద్భుతంగా వుంటాయి.

మకుటంలేని మహారాజుగా చెలామణీఅవుతున్న కింగ్‌కాంగ్‌కు ఎదురునిల్చి 'సెభాష్'అనిపించుకున్నవాడు దారాసింగ్. భుజాలమీద గుడ్డ కప్పుకునివుండి బొమ్మలో చిరునవ్వు నవ్వుతున్నాడు. భారతదేశపు కుస్తీకి స్వర్ణయుగం మళ్లీ వచ్చిందనిపించాడు. నరిసమానంగా ఏపుగాపెరిగిన కండలు తిరిగిన శరీరం. ఆకర్షణీయమైన ముఖం. చక్కని క్రాపూ. కుస్తీలో ఒడుపూ వేగమూ: యితని ప్రత్యేకతలు:

ఆ పక్కనే బొమ్మలో వున్నవాడురష్యన్ భల్లూకం. అతన్నితలుచుకుంటేనే హడల్‌పుడుతుంది. ఆతనికాపేరు ఎలావచ్చిందోగాని నిజంగా అతనిది భల్లూకపుపట్టే. పెద్దపెద్ద అంతర్జాతీయ వస్తాదులుకూడా మద్రాసులో అతని భల్లూకపు పట్టులోచిక్కి జవజవలాడి నీరుకారిపోయారు.

ఇంకా చాలా మంది వున్నారు కాని వారందరి ఫొటోలూ అతడు సేకరించలేక పోయాడు. అప్పుడు మద్రాసులో ఎంత హడావిడి...ఎక్కడెక్కడి మహావస్తాదులూ ఒక్కసారిగా రావటంతో గొప్ప అలజడి...జనం వేలకువేలు విరగబడిపోయారు. నగరంలో ఎక్కడ చూసినా అవే చర్చలు..వాగ్వాదాలూ...

రామకోటికి నిద్రపట్టింది. అతనికి సాధారణంగా కుస్తీలనుగురించి కలలు కనటమంటే గొప్ప యిష్టం. అటువంటి కలలు వచ్చిననాడు అతనికి చాలా హుషారుగా వుంటుంది. కాని యిటీవల చాలా రోజులుగా అతనికి కుస్తీలను గురించిన కలలు రావడంలేదు. ఎప్పుడూ కలల్లో పాములే కనిపిస్తున్నాయి. నిద్ర పట్టగానే మొదలు...రకరకాల పాములు...రకరకాల రంగులలో...లెక్కలేనన్ని కనిపిస్తాయి. ఒకసారి అయిదుతలలపాము కూడా కలలో కనిపించిందతనికి...ఇది విన్న ఒకాయన దాని ఫలితం చెప్పాడు. కలలోకి పాములు రావడం మృత్యుసూచనలు...'సరేలే, ఎందు కింకా బతకడం? బోలెడు జీవితం అయిపోయింది. ఇక ఈ స్థితిలో అనాయాసంగా చావడంకంటె మరేం కావాలి?' అనిపించిం దతనికి.

అతనికి యిష్టమైన కల మరొకటి వుంది. అతడు బాగా యవ్వనంలో వుండగా ఒక అమ్మాయిని ప్రేమించాడు. ఆ అమ్మాయి బంగారపు బొమ్మలా వుండేది. ఆమెను మొదటిసారి చూసినప్పుడు రామకోటికి మతి చెడింది. ఆమె నవ్వూ.. ఆ కళ్లలోని కాంతీ...అంత గొప్పవి. ఆమెను కేవలం చూస్తూ అతడు కొన్నినెలలు గడిపాడు. ఒక్కమాట లేదు. పలుకులేదు.. నవ్వులు విసరడం లేదు..సైగలు చేయడంలేదు. పోనీ బుద్ధిగా పెద్దవారితో సంప్రదించడమూలేదు. ఆమెకు ఉన్నట్టుండి ఎక్కడో సంబంధం కుదిరిందన్నారు. వెంటనే పెళ్ళీ అయిపోయింది. పెళ్లికి అతడుకూడా వెళ్లాడు. దూరంగా నిలబడిచూసి నాలుగు అక్షింతలు వేసి మరీ వచ్చాడు. చిరునవ్వులు చిందే అప్పటి ఆమె ముఖం అతనికి అప్పుడప్పుడు కలలోకి వస్తూవుంటుంది. ఆ రోజున అంతా అతడు పసివాడై పోతాడు. ఆ గదిలోనుంచి ఆనాడు వినిపించే పాటలకూ, కూనిరాగాలకూ, ఈల పాటలకూ అంతే వుండదు,

* * *

ఆ సాయంకాలం...

రామకోటి జేబులో టిక్కెట్టు భద్రంగా వుంచుకుని బయలుదేరాడు. మధ్యాహ్నమంతా నిద్రపోవడంవల్ల వొళ్ళంతా హాయిగా తేలికగా వుంది. పైగా చాలాఏళ్ళ తర్వాత అటువంటి కార్యక్రమానికి హాజరవుతున్నాడు తాను. ఇటీవల వూళ్ళో ఎవరూ ఇటువంటి కార్యక్రమాలు ఏర్పాటు చేయలేదు.

అతడు హుషారుగా అడుగులు వేస్తూ చురుకుగా నడిచాడు. విశాలమైన ఆవరణలో ప్రత్యేకంగా కుస్తీలకోసం ఏర్పాటు చేశారు. లోపలికి వెళ్ళేముందు ద్వారానికి అటూ యిటూ పెద్దపెద్ద బొమ్మ లున్నాయి. లోపల చాలా హడావిడిగా వుంది. రకరకాల తరగతుల టిక్కెట్లు కొనివచ్చిన జనం తమతమ స్థానాలలో కూర్చుని రొద చేస్తున్నారు. పలుచని లాల్చీలవారూ, మెడలలో పులిగోరులు ధరించిన వారూ, బుంగమీసాలవారూ, కొందరు నిర్వాహకులు అటూ యిటూ తిరుగుతున్నారు.

రామకోటి గ్యాలరీలో కూర్చుని చేత్తో మీసాలు సద్దుకుంటూ చుట్టూ చూశాడు. అతనికి గర్వం కలిగింది. ఈ జనంఅంతా కుస్తీలమీద వ్యాయామకళమీద అభిమానం వున్నవారే అనిపించిందతనికి. ఇంతమంది డబ్బు పెట్టి టిక్కెట్లు కొని ఈ తరహా పోటీలను ఇంకా ప్రోత్సహించడం అతనికి ఆనందం కలిగించింది. మనమూ ఒక ఛాన్సు తీసుకుందామా? అని కూడా అనుకున్నాడు.

కొంతసేపు నిరీక్షణ తర్వాత జనంలో గోల బయలుదేరింది. ఇద్దరు వస్తాదులూ గోదాలోకి దిగారు. వారిద్దరిలో ఒకడు పొట్టిగా లావుగా వున్నాడు. తల చాలా చిన్నది. రెండో వాడు పొడగరి. ఒడుపు వున్నవాడు..సన్నగా వున్నాడు. వారిద్దరూ గోదాలోకి దిగి ఒకరితో ఒకరు తలపడగానే ఇద్దరి శరీరాలూ పెనగాయి.

ఉండిఉండి జనంలో గోలా అరుపులూ ఎక్కువవుతున్నాయి. ఆనందించదగిన క్షణం వచ్చినప్పుడల్లా జనంలో ఉత్సాహం సముద్రపు హోరులా పెచ్చుపెరిగిపోతున్నది.

రామకోటి పక్కన ఉన్నవారు చాలా మంది లావుపాటి వాడి పక్షం. వాడు విజృంభించినప్పుడల్లా వారు పెద్దగా కేకలు పెడుతున్నారు. రామకోటికి వాడిలో మూర్ఖపు చొరవ తప్ప మరేమీ కనుపించలేదు. రెండోవాడే కొంచెం నయం....తప్పుకోడం, వీలుచూసుకుని వేగంగా ముందుకు దూకడంవంటి మంచి లక్షణాలు కొన్ని వాడిదగ్గర ఉన్నాయి.

రామకోటికి ఎడమప్రక్కన నడివయసు మనిషి ఒకడు ప్రశాంతంగా కూర్చుని చూస్తున్నాడు, రామకోటి అతనితో 'పోటీ బాగానే వుందికాని, వీళ్లు మరీ సగటు వస్తాదులు కూడా కారండీ···బొత్తిగా మామూలురకం... అయినా ఫరవాలేదు...' అన్నాడు.

ఆ మనిషి రామకోటి వంక చూసి 'ఏదో.. మామూలు కుస్తీలే. అయినా యివికూడా రాను రాను క్రమంగా తగ్గిపోతున్నాయి. మునుపు నేను చాలా చూశాను. చాలా వూళ్లలో చూశాను. ఆ హుషారే లేదిప్పుడు....ఏదో అభిమానంకొద్దీ రావడం తప్పితే....' అంటూ ఆగి అకస్మాత్తుగా అతన్ని గుర్తుపట్టినట్టు నవ్వి 'మిమ్మల్ని చాలా సార్లు చూశాను. విజయనగరంలో మొదటి సారి···నాకు బాగా గుర్తు. .మీరు నాలుగో వాడుగా వచ్చారు....ఒక మెడల్ యిచ్చారు మీకు....'అన్నాడు.

రామకోటి 'అవునవును..'అన్నాడు. అతని కళ్లవెంట ఆనందాశ్రువులు ఉబికి వచ్చాయి. అప్రయత్నంగా పైగుడ్డతో కళ్లు అద్దుకున్నాడు. తాను ఇరవై రోజుల క్రిందట అమ్ముకున్న ఆ ముచ్చటైన మెడల్ కళ్ళలో మెదిలింది.

'మద్రాసులో పోటీలు కూడా చూశాను. కుస్తీలంటే అవి....ఒక్కొక్కడూ జగజ్జెట్టి... కన్నులపండువుగావుంది కదండీ..అయినా యిక యిప్పుడీ కుస్తీలూ, గట్రా క్రమంగా తగ్గిపోతున్నాయి లెండి..తెలవారి లేస్తే అందరూ పొదుపుపొదుపు అంటున్నారు. మామూలుగా తినేవాళ్ళకే తిండి సరిగాలేదు. ఇక వస్తాదుల నేం తయారు చెయ్యగలం? పైగా యిదొక

తక్కువరకం హాపీ అయిపోయింది నలుగురి దృష్టిలోనూ..'అంటున్నాడింకా ఆ వ్యక్తి.

రామకోటి ఆనందంతో తల మునకలై కళ్లు మూసుకున్నాడు. అతడు కళ్లు తెరిచేసరికి ఆ రౌండ్ పూర్తిఅయింది.

* * *

అతడు యింటికి తిరిగి వెడుతూవుండగా వెంకటేశు కనిపించాడు. అతడు నలభైఅయి దేళ్ళవాడు. మనిషి సన్నగా పొడుగ్గా వుంటాడు. ఏదో ఆఫీసులో ప్యూను ఉద్యోగం చేస్తున్నాడు. జీతం తక్కువ..పై రాబడికి అసలు అవకాశం లేదు. దానికి తోడు కుచేల సంతానం.భార్య ఉత్తమురాలు. రామకోటి వారి యింటికి చాలా తక్కువసార్లు వెళ్లాడు. వెళ్లినప్పుడల్లా 'అన్నా' అంటూ పిలిచి తమకు కలిగిన దాన్లోనే కాఫీయో, మజ్జిగో యిచ్చిపంపుతూ వుండేది. పిల్లలు మొత్తం అయిదుగురు. అందులో ముగ్గురు మగపిల్లలు. ఆడపిల్ల లిద్దరూ బాగా చిన్నవాళ్ళు.

వెంకటేశు మొహం తుడుచుకుంటూ వచ్చాడు..రామకోటి అతని భుజంమీద చెయ్యి వేసి 'ఏమయ్యా? ఎట్లా వున్నావు? పిల్లలు కులాసా?' అని అడిగాడు.

వెంకటేశుకు తన పిల్లలంటే ప్రేమ. అతని ముఖం ఈ ప్రశ్నతో వికసించింది. 'మా పెద్దవాడిప్పుడు ఫిఫ్తుఫారం చదువుతున్నా డయ్యా; క్లాసులో వాడే ఫస్టు. మరొక సంవత్సరం ఓపికపడితే తర్వాత వాడికి మా ఆఫీసరుగారు ఉద్యోగం వేయిస్తానన్నాడు..తర్వాత వాళ్లిద్దరినీ బాగా పెద్దచదువులు చదివించాలని మా ఆవిడ పట్టుదల..నా ఉద్దేశమూ అదే. అన్నట్టు నువ్వీమధ్య బొత్తిగా నల్లపూసవై పోయావేం? ఏమిటి కథ?' అన్నాడు.

రామకోటి నవ్వి వూరుకున్నాడు. వెంకటేశు మళ్లీ 'పిల్లలు 'మామ, మామ' అని గోల చేస్తున్నారయ్యా! ఒక్కసారి రాగూడదూ? ఏదో మాతోబాటు కలో గంజో తాగి కాస్సేపు ఉండిపోవచ్చు. తప్పకుండా రా..' అంటూ సందు మలుపుతిరిగి పోయాడు.

రామకోటి నడుస్తూ ఆలోచనలో పడ్డాడు. మళ్లీ రేపు తలుచుకుంటే భయంగా వుంది. ఎట్లా గడుస్తుంది? ఏమిటి చెయ్యడం? ఎక్కడన్నా ఏదన్నా పనిలో కుదురుకుంటే బాగుండిపోను. వెంకటేశుతో ఒక్కమాట చెప్పి వుంచితే బాగుండేది. ఏ ఆఫీసులో ఏ చిన్న ఉద్యోగం దొరికినా రోజులు వెళ్లిపోతాయి. ఇటీవలవరకూ తనకు డబ్బు పంపించిన రాజా గారు గుర్తుకు రాగానే అతని కళ్లు నీళ్ళతో నిండాయి. ఆయనతో ఒకప్పుడు 'నా కెక్కడన్నా చిన్న ఉద్యోగం ఇప్పించండయ్యా! చేసుకు బతుకుతాను. ఒక్కడి పొట్టకు ఎంత కావాలి? మీరు ప్రతినెలా ఊరికే డబ్బు పంపిస్తూ వుంటే తిని కూర్చోడం తప్పుగా వుంది..' అన్నాడు రామకోటి. ఆయన అది విని గంభీరంగా నవ్వి 'అదేమన్నమాట? నేను కన్నుమూసేవరకూ మా సంప్రదాయాలు యిలా సాగిపోవలసిందే. నువ్వు మొదటినుంచీ మా మనిషివి. మేము నిన్ను అభిమానించాము. చిన్నప్పటి నుంచీ నువ్వు మా నీడలో పెరిగి పెద్దవాడవై మాకు పేరు తెచ్చావు. ఏదో మాకు చేతనైనంత ఎక్కువో తక్కువో యివ్వడం మా ధర్మం—ఎక్కువ యివ్వటానికి మునుపటి రోజులూ కావనుకో..ముసలివాడివై పోయావని నిన్ను వొదిలేస్తామా?..'అన్నాడు.

ఆయన చనిపోయిన తర్వాత తన అసలు బాధ ప్రారంభమైంది. ఆకలి యింత దారుణంగా మనుష్యులను బాధించగలదని అతనికి యింతవరకూ తెలీదు.

ఎవరో అతన్ని పిలిచారు...రామకోటి ఆగాడు. వాడా పేటలో పెద్దరౌడీ అని పేరు పొందినవాడు. కొంచెం డబ్బున్నవాడు. దాడి ప్రయోజకత్వం రామకోటికి బాగా తెలుసు. అనవసరంగా ప్రతివారితోనూ పోట్లాట పెట్టుకోవడం, సోడాబుడ్లు పెట్టి ఎదుటివారిని కొట్టడం, పదునైన బ్లేడుతో హఠాత్తుగా అవతలివారిని గాయపరచడం—ఇటువంటివాటిలో ఘనుడు.

అతడు పళ్లన్నీ బయటపడేట్టు నవ్వి 'నువ్వు పెద్ద ఫైల్మాన్‌వుకదా? నేనొక పని

చెప్తాను చేస్తావా? పని సక్రమంగా చేసుకొస్తే పాతిక రూపాయ లిస్తాను' అన్నాడు.

రామకోటి తలవూపి 'ఎవరినన్నా తన్ని రమ్మంటావా?'అని అడిగాడు.

వా డాశ్చర్యపోయి 'బలే ఊహించావే! సరిగ్గా అదే..చేస్తావా, మరి?' అని అడిగాడు.

రామకోటి 'చేస్తాను. నాకు మనిషిని చూపించు..' అన్నాడు.

వాడు మళ్లీ నవ్వి 'సరే, పోదాం రా.. మందు పోయించాలా?'అని అడిగాడు నడుస్తూ.

రామకోటి తల అడ్డంగా వూపి 'అఖ్ఖర్లేదు' అన్నాడు.

ఇద్దరూ దాదాపు రెండు ఫర్లాంగుల దూరం నడిచారు. అతడొక సందు మొదట్లో హఠాత్తుగా ఆగి రామకోటిని ఆపి 'అదుగో అటు చూడు..సరిగ్గా సమయానికి వచ్చాం... వాళ్లిద్దరూ మెట్లెక్కడంలేదూ? అదే క్ళ రూము.. ఆ యిద్దరిలో అవతలివాడు..స్టూడెం .' అన్నాడు.

రామకోటి కళ్లు నులుముకుని మరీ చూశాడు. ఆ యిద్దరినీ అతడు మరిచిపోగలడా? తాళంచెవులగుత్తి వ్రేలితో తిప్పుతూ తన మిత్రుడితో నవ్వుతూ కబుర్లు చెబుతున్న అతని విగ్రహం స్పష్టంగా కనుపించింది. మరుక్షణంలో వాళ్ళిద్దరూ లోపలికి వెళ్లిపోయారు.

రామకోటి ప్రక్కకు తిరిగి 'అతనేం ద్రోహం చేశాడు నీకు?' అని అడిగాడు.

'మొన్న సినిమాహాల్లో మాటా మాటా పెరిగింది. నన్ను అందరిలోనూ కొట్టాడు.'

'నువ్వు తిరిగి కొట్టలేకపోయావా?'

'తిరిగి కొట్టడమా? దెబ్బ కాచుకోడం కూడా చేతకాలేదు. అదేమి ఛెయ్యి? అదేమి చురుకు? కరెంట్ షాక్ తగిలినట్టే....చూసేందుకు అలా వున్నాడా? చేతిచురుకు..బాబోయ్.. చెప్పలేననుకో....'

రామకోటి తల అడ్డంగా వూపి 'నేనేమీ చెయ్యలేను' అంటూ వెనుదిరిగాడు.

'అరె! పెద్దవస్తాదువని పిలిచానే నిన్ను ఇంతేనా. సంబడం..'అన్నాడతడు వ్యంగ్యంగా.

రామకోటి 'అవును...అంతే....' అంటూ సాగిపోయాడు.

* * *

మూడురోజులైంది. రామకోటి మంచంలో పడుకుని ఆలోచిస్తున్నాడు. ఈ మూడు రోజుల నుంచీ అతడు కేవలం మంచినీళ్లతోనే కాలం గడిపాడు. ఇప్పుడు పరిస్థితి అతని వశంలో లేదు. పొట్టలో మండుతున్న కొలిమి ఒకటి ఉండి సెగలు పొగలు చిమ్ముతున్నటు పిస్తున్నది.

అతడు నీరసంగా లేచాడు. రాజాగారి బొమ్మ కనుపించింది. నీళ్ళు నిండిన కళ్ళతో చేతులు జోడించి, 'ఆకలి యింత భయంకరంగా వుంటుందని నాకు తెలీకుండా ఏళ్ళ తరబడి పోషించావు. మళ్లీ జన్మ అంటూవుంటే నీ ఋణం తీర్చుకుంటాను...' అనుకున్నాడు.

నెమ్మదిగా లాల్చీ తొడుక్కుని తుండు పైన వేసుకుని తలుపు దగ్గరికి లాగి యివతలికి వచ్చాడు. గుడ్డివెన్నెల...ఒకదానిమీద ఒకటి కట్టినట్టున్న పాకలు...వాటి ముందు బొంతలూ, చాపలూ, కుక్కిమంచాలూ వేసుకుని పడుకున్న పేదలు..కొంచెందూరంలో చెట్ల క్రింద అమాత్రపు వసతులు కూడా లేని దేశద్రిమ్మరులు..వీరంతా ఏం తింటున్నారు? ఎలా సంపాయిస్తున్నారు?

అతడు నీరసంగా నడిచి వెళ్లి ఒక డాబా యింటిముందు ఆగాడు. అది కుస్తీల కంట్రాక్టరు యిల్లు..పిలుపు విని ఒక కుర్రవాడు వచ్చి 'మా నాన్నగారికోసమా? లోపలికిరా..?' అన్నాడు.

పంచలో వాలుకుర్చీలో కూర్చుని పేపరు చూస్తున్నా డాయన. రామకోటి నమస్కరించి పంచ మెట్టు మీద కూర్చున్నాడు. ఆయన 'ఏం కావాలి?' అన్నట్టు చూశాడు.

'నా పేరు రామకోటి..మీరు వినేవుంటారండీ..దేశమంతటా ఎన్నోచోట్ల పెద్దపెద

వాళ్ళతో పోటీచేసి 'సెభాష్' అనిపించుకున్నాను. మా రాజాగారికి నేనంటే అభిమానం..ఇప్పటి దాకా ఆయనే నన్ను పోషించారు. ఇటీవలే ఆయన పోయారు..కొంచెంబాధల్లో వున్నాను..' అన్నాడు రామకోటి.

'అయితే ఏంచెయ్యమంటావు? అని అడిగాడాయన.

రామకోటి నెమ్మదిగా 'వచ్చే ఆదివారం నాడు నా కొక ఛాన్సు యిప్పించండి. నేనూ గోదాలోకి దిగుతాను..అవతలి వాళ్ళు కెంత యిస్తారో నాకూ అంతే యివ్వండి..' అన్నాడు.

ఆయన కళ్లు చిన్నవిచేసి నిశితంగా చూసి హఠాత్తుగా 'ముసలాడివి నీ కెందుకు లేవయ్యా. ప్రమాదవశాత్తూ ఏ కాలో చెయ్యో విరిగినా ఆ ఉసురు నాకు చుట్టుకుంటుంది. అవతలవాళ్ళంతా రాక్షసులు..శివమెత్తినట్టు గోదా అంతటినీ దున్నుతున్నారు. ఆ రోజులు కావు యివి..ఒక్కొక్కడూ నిన్ను నంచుకుతింటారు ఏమనుకున్నావో. దుస్సాహసం పనికిరాదు.. అంత యిబ్బందిగావుంటే రేపొకపూట మా యింటికి రా..అన్నం తినిపోదువుగాని..' అంటూ మళ్ళీ పేపరు చూడటం ప్రారంభించాడు.

రామకోటికి నవ్వు వచ్చింది. ఆ రోజులు కావు నిజమే..అయినా గోదా అంతటినీ దున్నడం గురించీ, నంచుకుతినడంగురించీ ఆయన అన్న మాటలు యదార్థాలు కావు. తనకు తెలును వాళ్ళ పరాక్రమం ఎటువంటిదో! అతడు నీరసం వల్ల ఒక్కక్షణం నిశ్శబ్దంగా ఊరుకుని తర్వాత లేచి 'సెలవు బాబూ!' అని చెప్పి బయటికి వచ్చాడు.

వీథిలోకి రాగానే నిస్సత్తువ అతన్ని ఆవహించింది. ఉన్నట్టుండి కాళ్లు తడబడ్డాయి. ఒళ్ళు తూలింది. ఎవరో తనను పిలుస్తున్న సవ్వడి..వెనుదిరిగి చూస్తే ఎవరూ లేరు.

అతడు కాళ్ళీడ్చుకుంటూ మరికొంత దూరం నడిచి వెంకటేశు యింటిముందు నిలబడ్డాడు. వాళ్లింట్లోయిప్పుడు అన్నంవుంటుందా? వెంకటేశు సంపాదన తనకు తెలియనిది కాదు. ఇప్పుడు వెడితే యిబ్బంది పెట్టడం అవుతుందేమో!

అంతలో వెంకటేశు బయటికి తొంగి చూసి 'ఎవరదీ?' అంటూ యివతలికి వచ్చి అతన్ని గుర్తించి 'నువ్వేనా రామకోటీ! అలా నిలబడిపోయావేం? రా లోపలికి. సరిగా సమయానికి వచ్చావు. మీ చెల్లెలు అందరికీ అన్నాలు పెడుతున్నది. ఇంతసేపూ పిల్లలు చదువుకుంటూ కూర్చున్నారు. అందుకని ఇవాళ ఆలస్యమైంది..' అంటూ అతన్ని లోపలికి తీసుకుపోయాడు.

లోపల పిల్లలందరూ పింగాణీ కంచాల ముందు కూర్చునివున్నారు. ఆఖరి పిల్లవాడు రామకోటిని చూసి వెలుగు కుమ్మరిస్తూ నవ్వాడు. వెంకటేశు భార్య తలఎత్తిచూసి 'నువ్వా అన్నా! రా, కొన్నాళ్ళకు వచ్చావు. మమ్మల్ని బొత్తిగా మర్చిపోయా విన్నాళ్ళూ..' అన్నది వేరే విస్తరి వేస్తూ.

రామకోటి కళ్ల ముందు మచ్చలు కదులుతున్నాయి. అతడు ఏమీ బదులు చెప్పకుండా విస్తరిముందు వెళ్లి కూర్చోవడం చూసి భార్యాభర్తలు ఒకరిముఖం ఒకరు చూసుకున్నారు. అంతలోనే వెంకటేశు భార్య గిన్నెలో మిగిలిన అన్నం అంతా విస్తరిలోపెట్టి అధరువేదో వేసి 'అన్నా..కానివ్వు' అన్నది. వెంకటేశు అతని పక్కనే కూర్చున్నాడు.

రామకోటి త్వరత్వరగా నాలుగు ముద్దలు మ్రింగి నీళ్లుతాగి ఈ ప్రపంచంలోకి వచ్చాడు. తర్వాత మిగిలిన అన్నంతింటూ పిల్ల లందరినీ పలుకరించాడు. వెంకటేశు భార్యతో 'ఉన్న అన్నంఅంతా నాకే పెట్టేశావు. నువ్వేంతింటావు చెల్లెమ్మా!' అన్నాడు. ఆమె నవ్వుతూ 'మళ్లీ కుంపటిమీద బియ్యం కడిగిపెడితే ఎంతసేపు.. క్షణంలో కాదూ..' అన్నది.

రామకోటి చెయ్యి కడుక్కొని 'నాకూకూడా ఎక్కడన్నా చిన్నఉద్యోగం చూసిపెట్టవయ్యా..' అన్నాడు. వెంకటేశు బీడీ యిస్తూ ఆ మాట విని నవ్వాడు. రామకోటి కూర్చుని బీడీ ముట్టించుకోబోతూ ఆగి హఠాత్తుగా 'ఎవరో

# పాలరాతి బొమ్మలు

శ్రీ ఇంద్రగంటి శ్రీకాంతశర్మ

పాడుదమన్న నేదియును
　　భాషకునందక, రాగమందె పా
రాడి, కడింది వేదనను
　　అంతిలుగాని రసాకృతిన్ మదిన్
వీడదు; నా మనోనయన
　　వీక్షణమెంతయు లోక యాత్రలో
నీడలనే చరించు, మది
　　నేదియొ మూల్గను కంఠమెత్తినన్.

నా కనులందు వెన్నెలలో
　　నర్తన మేమిటి చేసిపోయెనో
నాకపురీ విలాసినులు
　　నాకొవు కాంతి శరీర శోభతో
నా కమనీయ భావనకు
　　నాటకశాలలనుండి డిగ్గి వా
రే కవితా కృతిన్ దవరి
　　రేమొ; నటించిరి పాలరాతిపై

ఈ తళుకెట్లు వచ్చినది!
　　ఏ పువురేకుల పాలు పిండి యీ
రాతిని చేసె ధాత; పర
　　రాజులు తాకుట కోర్వలేని యే
నాతి శరీర రేణువులు
　　నవ్వుచు జేరెను పాలరాతిపై
ఏ తరుణానిలమ్ములిట
　　ఇంతటి ఊపిరి పోసి పోయెనో!

మదనుడు వైచినట్టి ఒక
        మల్లియ బాణము త్రోవ తప్పి, పే
రెద లుడికింప బోవుటల
        నేమరి, సూటిగ తాకెనేమొ, యీ
కదలని పేదరాతికి, వి
        కాసము నిచ్చినమాట వింటివే!
పదనగు మల్లె పాటవము
        పాలను రాతిని పొంగజేసెనో!

మల్లియతీవ వ్రేలినటు
        మంచుముసుంగులుజారినట్లుగా
తెల్లని చంద్రికాంచలము
        దేహముపై కనిపియాడినట్లుగా
చల్లని జ్ఞప్తి పైకొనగ
        శారద శర్వరి రాగయుక్తవౌ
పిల్లనగ్రోవి పిల్పునకు
        బేలయి ఇచ్చట బొమ్మయైనదో!

కవి ఉలి వాక్కు; శిల్పులకు
        కాతర భావము కల్గజేయగా
కవన వనమ్ములో నిలుపు
        కాంతిమయమ్మగు శిల్పసంపదల్
అవనత శీర్షుడౌ నటర!
        ఆ మహితాత్ముడు శిల్పి! నవ్వి, తా
కవితను చెప్పనేర్చు మన
        కంటికి తోచెడు శిల్పరేఖలో!

---

# పినపళ్ల తామ్రశాసనము : అందలి చరిత్రాంశముల పరామర్శ

శ్రీ తురగా కృష్ణమూర్తి

శ్రీ మునుగంటి సాంబశివరామమూర్తిగారు "భారతి" (సంపుటము 44 – సంచిక 2) లో "అల్లాడ వేమభూపవరము — పినపళ్ల తామ్రశాసనము" ను ప్రచురించి, చారిత్రక పరిశోధకుల కింతవరకును విడదీయరాని చిక్కు సమస్యలుగా నిలిచియున్న రెండు చారిత్రక సత్యములను బయల్పరచి, కొండవీటి రెడ్డి రాజుల చరిత్రమున నింతవరకు సందేహాస్పదములుగా నున్న విషయాలను అనుమానరహితములుగా నొనరించినారు. అందులకు వారికి చారిత్రక పరిశోధకు లందఱును యెంతయో కృతజ్ఞతా జూపవలసి యున్నది.

ఇట్లనే లోగడ శ్రీ కొల్లూరి హర్షవర్ధన శర్మగారు "కాటయవేముని అన్నవరం తామ్రశాసనము"ను వెలువరించి, రెడ్డిరాజుల చరిత్రలో వివాదాస్పదములుగా నిలిచిపోయిన మూడు ముఖ్య విషయములను పరిష్కార మొనర్చి, చరిత్ర జిజ్ఞాసువుల కృతజ్ఞతకు పాత్రులైనారు. ఈ రెండు తామ్రశాసనములును వెలికి వచ్చుటలో రెడ్డిరాజుల చరిత్రమునందు కొఱకరాని కొయ్యలుగ మిగిలిపోయిన అయిదు వివాదాంశములు ప్రస్ఫుట ఫణితిని, నిర్ద్వంద్వముగ నివృత్తి చేయబడి, చరిత్రకారుల మార్గమును సుగమ మొనర్చినవి. ప్రస్తుత ప్రసక్తాంశమైన "పినపళ్ల తామ్రశాసనము" లోనున్న చరిత్రాంశములలో "చర్చనీయాంశము"గా శ్రీ సాంబశివరామమూర్తిగా రొకదాని నుల్లేఖించి, తద్విషయమైన చర్చను సమగ్రముగా కొనసాగింపక, అరకొరగా స్పృశించి వదలివైచినారు.

పినపళ్ల తామ్రశాసనములో "చర్చనీయాంశము"గా గ్రహింపబడిన విషయము—

పుత్రీ కాటయవేమభూప తనయ
శ్రీ కాటయక్ష్మాపతేః
పౌత్రీ త్ర్యర్ణవశాసితు ర్హరిహర స్యోర్వీశ
చూడామణేః

తన్నామ్నా ప్రథితాచ సా హరిహరాభిఖ్యా
మహాభాగినీ
ముఖ్యా దేవ్యభవత్ పవిత్ర చరితా
శ్రీ వేమపృథ్వీపతేః॥

అన్న శ్లోకము. ఈ శ్లోకమును బట్టి "కాటయ వేముని కుమారుడైన కాటయకు పుత్రియు, మూడు సముద్రముల పర్యంతము శాసించిన హరిహర రాయ పృథ్వీశ్వరుని మనుమరాలు (దౌహిత్రి), పవిత్ర వంతురాలును, అదృష్టభాగినియునై ఆ తాతగారి పేరుతో వెలసిన హరిహరాంబ వేమభూపాలుని ముఖ్య భార్య అయ్యెను." అనునది స్పష్టమగుచున్నది.

ఈ యదార్థమునకు భిన్నముగా నింతవరకు ప్రఖ్యాతి వహించిన చారిత్రక పరిశోధకులు నేటి దనుక లభ్యములైన శాసన సంచయములోని శ్లోక పాఠములను తమ యిష్టము వచ్చినట్లు కూర్చియో, మార్చియో, చేర్చియో, అన్వయించియో విపరీత వ్యాఖ్యానములకు దిగి, అసంబద్ధములగు నిర్ణయముల నొనర్చి, అయోమయస్థితిని కల్పించినారు! అట్టి వాదనాస్వరూప స్వభావముల నుట్టంకించి, విమర్శించి, యదార్థ విషయ నిర్ణయము నొనరించి, ప్రస్తుత శాసనాంశముతో నా నిర్ణయ మెట్లు సమన్వయ మగుచున్నదో వివరించుట కుద్దేశింపబడిన దీ వ్యాసము.

అల్లాడ వేమభూపతి పట్టమహిషి హరిహరాంబ, కాటయవేముని పౌత్రి, కాటప్రభుని పుత్రి, హరిహర రాయల దౌహిత్రి యన్న విషయ మింతకు మున్నొక శాసనములో నుల్లేఖింపబడి యున్నది. అది అల్లాడ రెడ్డి కోరుమిల్లి శాసనము. ఆ శాసనములో నీ విషయమును గురించి చెప్పు శ్లోక మిది :

పౌత్రీం కాటయ వేమయ క్షితిపతేః
పుత్రీంచ కాటప్రభోః
దౌహిత్రీం చతురర్ణవీం హరిహర
క్షోణీపతే శ్శాసితుః

తన్నామ్నా విదితాహ్వయాం హరిహరాంబాం
చారు మగ్రాహయ
త్వాశౌ వేమమహీశమల్లనృపతిస్సామ్రాజ్య
లక్ష్మ్యైనమం॥

దీనినే ప్రసంగించుచు Elliot's Collectionsలో 320 పుట యందు బార్నెటు దొర వారు ' The Vemavaram plates of Allayavema which will be mentioned in the next paragraph refer to KataPrabhu who was the son of Kataya Vema and who married the daughter of Hari Hara evidently of the Vizianagara King Hari-Hara" (Annual Report on Epigraphy 1906-Para 63) అని కాటయవేముని కుమారుడు కాటప్రభువు విజయనగరరాజగు హరిహరరాయల జామాత యని వ్రాసియున్నారు. అల్లాడ వేమవరపు శాసనమందు కూడ "పౌత్రీం కాటయవేమయక్షితిపతేః పుత్రీంచ కాటప్రభోః" యిత్యాదిగా గల శ్లోకమే యథాతథముగా నుల్లేఖించబడినది. కోరుమిల్లి శాసనము, అల్లాడవేమవరపు శాసనముఁబట్టి కాటయవేమునకు కాటప్రభువను కుమారు డొక డుండెననియు, ఆతడు విజయనగర సామ్రాజ్యాధీశుడు హరిహరరాయల కూతును వివాహమాడె ననియు, కాటయకును విజయనగరరాజు హరిహరుని కుమార్తెకు నుదయించిన "హరిహరాంబ"ను అల్లాడ వేమభూపాలు డుద్వాహమాడెననియు నిర్ధారణమగు చున్నది. ఇంత స్పష్టముగానున్న విషయము దురదృష్ట వశమున, చారిత్రక పరిశోధకులు పలువురకు పలు విధములుగా అర్థమయి, విభిన్న సిద్ధాంతములకు దారి తీసి, అసంబద్ధ నిర్ణయముల జేయించినది. ఆ చరిత్రమునే ఈ వ్యాస ముఖమున వివరించి, మున్ను చెన్న ప్రముఖ పరిశోధకులేయే పట్టుల నేయే యూహ లొనర్చిరో, యేయే సవరణల గావించిరో, యేయే నిర్ణయములకు వచ్చిరో సవిమర్శగ, తలస్పర్శగ విశదీకరించి యందలి ఉచితానుచితముల విపులీకరించి నిర్ధరించుటకు యత్నింతును.

ఈ శ్లోకమునే చరిత్ర చతురాననులు శ్రీ చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు తమ "ఆంధ్రుల చరిత్ర—3 వ భాగము" (పుట 195) లో ని ట్లుల్లేఖించియున్నారు :

పౌత్రీం కాటయవేమయక్షితిపతేః
పుత్రంచ కాటప్రభోః
దౌహిత్రం చతురర్ణవీం హరిహరక్షోణీపతే
శ్శాసితుః
తన్నామ్నా విదితాహ్వయాం హరిహరాంబాం
చారుమగ్రాహయ
త్వాశౌ వేమమహీశమల్లనృపతిస్సామ్రాజ్య
లక్ష్మ్యైనమం॥

ఇందు "పుత్రం" "దౌహిత్రం" యను పదములు తప్పు. అని "పుత్రీం" "దౌహిత్రీం" యని సవరించి చదువవలసియున్నది. అట్లు గానిచో నీ శ్లోకమున కన్వయము కుదురక, అర్థశూన్య మగును. శ్రీ పంతులుగారు వీటిని సవరింపకయే శ్లోకమును పై విధముగనే యుదాహరించి, శ్లోక పాఠము ని ట్లిచ్చియున్నారు :

"కాటయవేమారెడ్డి ప్రబలుఁడనియు, కుమార గిరిరెడ్డికి మంత్రియు, సేనాపతి యనియు రాజమహేంద్రవరరాజ్యమున కధిపతియునై యున్న వాడని యెఱింగి యాతనితో మైత్రిగనున్న యెడల గజపతులవలన నే హానియు దన సామ్రాజ్యమునకు సంభవింపదని తలంచి, రాజాధిరాజ రాజపరమేశ్వరుండను బిరుదాభిధానము గల హరిహరరాయలు తన కొమార్తె "హరిహరాంబ" యను నామెను కాటయవేమారెడ్డి పుత్రుడగు కాటయప్రభున కిచ్చి వివాహముఁ జేసెను. ఈ వివాహ విషయము అల్లాడరెడ్డి కోరుమిల్లి శాసనములో వక్కాణింపబడినది"ని పై శ్లోకము నిచ్చియున్నారు. అంతటితోఁబోక "అల్లాడవేమారెడ్డి కోరుమిల్లి శాసనమున కాటయవేమునకు కాటప్రభువను కుమారుడు కలడనియును, ఆతడు హరిహరరాయల కొమార్తె యగు "హరిహరాంబ"ను వివాహముఁ జేసికొనియెననియు (పుట 256) జెప్పబడినది"ని పునరుద్ఘాటించియున్నారు. ఇంకను తనివినక వారు "అల్లాడభూపతి పరిపాలనము ప్రారంభమగునప్పటికి కాటయవేముని కుమారుడు కాటయప్రభువు మరణించె ననియు యూహింపవలసి యుండును. కర్ణాట సామ్రాజ్యాధిపతి యగు హరిహరదేవరాయల కొమార్తె "హరిహరాంబ" పెనిమిటి యగుటవలనఁ గాటయప్రభువు తాను బ్రతికియుండగా దన రాజ్య మన్య లాక్రమించి పరిపాలించుట కొప్పుకొనడు"

(పుట 261) అని యొక యూహ వెలార్చినారు. మరొకచోట (పుట 374) "రెండవ హరిహర రాయలు కొండవీటిరెడ్లతో మైత్రి కలిగియున్నట్లు గన్పట్టుచున్నది. ఇతడు తన కుమార్తె యగు "హరిహరాంబ"ను కాటయవేమారెడ్డి కుమారుడగు కాటయ్రప్రభుని కిచ్చి వివాహము చేసెను." అని ఉగ్గడించియున్నారు.

కాటయవేమున పౌత్రి, కాటప్రభుని పుత్రి, హరిహరరాయల దౌహిత్రి యగు "హరిహరాంబ" పాణిని అల్లయవేముడు గ్రహించెనని శ్లోకమర్థమిచ్చు చుండగా శ్రీ పంతులుగా రిట్టి వ్యాఖ్యానమునకు దిగి, "హరిహరాంబ" విజయనగర దేశాధీశుని దుహిత యని, కాటప్రభుని యర్ధాంగి యని జెప్పుట కెట్టి యాధారమును జూచుకొన్నారో దుర్గ్రాహ్యముగా మున్నది! తమ వ్యాసములో శ్రీ సాంబశివరామమూర్తిగారీ విపర్యాసమును గమనింపకయే శ్రీ పంతులుగారు తమ అభిప్రాయమున కనుగుణముగనే "ఆంధ్రుల చరిత్ర"లో నీ విషయ ముద్ఘాటించినట్లు వీందు సంతృప్తిని వెల్లడించినారు! కాటయ కుమార్తెగా వంచిన "హరిహరాంబ" "ఆంధ్రుల చరిత్ర" లో అర్ధాంగిగా వర్ణింపబడిన విషయమును శ్రీ సాంబశివ రామమూర్తిగారు గమనింపకుండు టెంతటి వైపరీత్యము!

శ్రీ పంతులుగారు కాటయవేముని కుమారుడు కాటప్రభువు విజయనగర హరిహరరాయల కుమార్తె "హరిహరాంబ"ను వివాహమాడెనని వక్కాణింపగా నదిగాదని శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు తమ "History of the Reddi Kingdoms" లో విజయనగర క్షితిపతి హరిహరరాయల కుమార్తె "హరిహరాంబను" పెండ్లాడినది కాటయవేముడుగాని కాటప్రభువు కాడని యిట్లు వ్రాయుచున్నారు :

"When there was civil war in the kingdom, Hari Hara II King of Vizianagar marched as far as Tripurantakam and captured that stronghold......... King Kumaragiri soon after the conclusion of the civil war sent his Generalissimo Kataya Vema Reddy with a large army against Hari Hara II to recover the Tripurantakam and Srisailam districts. Kataya Vema succeeded in inflicting a severe defeat on the Vizianagara forces...He (Hari Hara II) therefore realised the necessity of maintaining friendly relations with the neighbouring Reddi Kings in order to strengthen himself against the growing power of the Bahamani Sultans and of the Recerla Kings. Hence he thought it prudent to come to terms with Kumaragiri. Kataya Vema also was anxious to come to an agreement with the Vizianagara King as it would be to the advantage of Kondavidu to have the Vizianagara Power on its side against both its external and internal enemies.........The marriage alliance alluded to in the Vemavaram plates (Ep.Ind.Vol XIII — V. 22—P. 242) of Allaya Vema Reddi refers to this Period. Hari Harva II cemented this political alliance by giving his daughter Hari-Haramba in marriage to Kataya Vema him self. 1 (Chapter VIII. Pages 127 128)

---

1. శ్రీ సోమశేఖరశర్మగారి యీ వ్రాత తప్పని శ్రీ కొల్లూరి హర్షవర్ధనశర్మగా రిట్లు నుడువుచున్నారు :

"బ్రహ్మశ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు "By giving his daughter HariHaramba in marriage to Kataya Vema himself" అని వ్రాయుట పొరబాటుగాని లేక ముద్రణ స్ఖాలిత్యమైగానియైయుండవలెనని నా తలంపు.వారు అల్లాడరెడ్డి వేమవరశాసనమును ప్రస్తావించి, దాని ఆధారముగా హరిహరరాయల కుమార్తెయగు "హరిహరాంబ" కాటయవేముని భార్య అని వ్రాసిరి. హరిహరరాయల మనుమరాలు (కూతురు కూతురు) "హరిహరాంబ"గాని, కూతురు 'హరిహరాంబ' కాదు. తల్లి కూతుళ్లకిరువురకును 'హరిహరాంబ' నామధేయ ముండకూడదా? యన్న అది వేరు విషయము. హరిహరరాయల మనుమరాలు, అల్లాడ వేమారెడ్డి భార్య పేరు మాత్రమే "హరిహరాంబ" యని వేమవర శాసనమునుబట్టి తెలియును; కాని— హరిహరరాయల కుమార్తె పేరింతవరకు తెలియరాలేదు."

శ్రీ సోమశేఖరశర్మగారు వారి గ్రంథము "History of the Reddi Kingdoms" లో మరియొక చోట (Chapter IX. P. 157) "The battles of Gundugolanu and Konuru referred to in the above mentioned Catu Verse were some of the engagements that had taken place in the course of this war. If the same verse is relied upon, it may be said that, just at this juncture, Hari Hara II of Vizianagara probably with the object of diverting Peda Komati Vema's forces and helping his ally and son-in-law Kataya Vema, made another incursion into the Kondavidu Kingdom which shook its very foundations." అని కాటయవేముడు విజయనగర సామ్రాజ్యాధినేత హరిహరరాయల జామాత యని స్పష్టముగా తమ అభిప్రాయమును వెలిబుచ్చియున్నారు.

సుప్రసిద్ధ తెలంగాణా చారిత్రక పరిశోధకులు ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం శ్రీ బాలేందు శేఖరంగారలు తమ "ఆంధ్రుల చరిత్ర—సంస్కృతి"లో "క్రీ॥ శ॥ 1386—90 నడుమ కాటయ వేముడు రెడ్డిరాజ్యముపై దండెత్తివచ్చిన విజయ నగరరాజు రెండవ హరిహరరాయని సేనల నోడించెను. అంతట నా రాజు రెడ్డిరాజ్యముయొక్క బలిమిని గుర్తించి కాటయవేమునకు తన కుమార్తె "హరిహరాంబ" నిచ్చి వివాహము చేసెను.' (P. 287) అనియు, "రెండవ హరిహరరాయలు (1377—1404) కాలమునందు కొండవీడున కుమారగిరి రెడ్డియు, రాజమహేంద్రవరమున కాటయవేమా రెడ్డియు పాలనము చేసిరి. రెడ్డిరాజులు రెండవ హరిహరరాయనికి సామంతులుగ నుండలేదు. రాయలు రెడ్డిప్రభువుల బలిమిని గుర్తించి తన కుమార్తెయగు "హరిహరాంబ"ను కాటయ వేమారెడ్డి కిచ్చి వివాహము చేసెను." (P—319) అని వ్రాయుచు శ్రీ సోమశేఖరశర్మగారి వాదన ననువదించి యున్నారు.

శ్రీ కొల్లూరి హర్షవర్ధనశర్మగారు Epigraphia Indica—Vol XXXVI—P—173 లో "Annavarappadu Plates of Kataya Vema Reddi" అను వ్యాసములో "There is reason to believe from the Vemavaram grant of Allada Vema Reddi (S. I. I. Vol XIII. PP. 237 ff) that a daughter of the Vizianagara King Hari Hara II was also one of the Queens of Kataya Vema Reddi" అని వ్రాయుచు (హరిహరాంబ నామమును పేర్కొనలేదుగాని) విజయనగరాధిపతి రెండవ హరిహరరాయలు నకు కాటయవేమారెడ్డి అల్లుడైనట్లు అంగీకరించినారు.

ఈ వ్రాతలవలన "హరిహరాంబ" కాటయ వేముని అర్ధాంగి యగుచున్నది. ఏ శాసనము నాధారముగాకొని శ్రీ వీరభద్రరావుపంతులుగారు "హరిహరాంబ" కాటయవేముని కొడుకు కాటప్రభుని యర్ధాంగి యనినారో, ఆ శాసనమునే పురస్కరించుకొని శ్రీ సోమశేఖరశర్మ ప్రభృతులు "హరిహరాంబ" కాటయవేముని అర్ధాంగిగాని కాటప్రభుని యర్ధాంగి కాదని వక్కాణించుచున్నారు.

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు మరొక క్రొత్తమార్గమును త్రొక్కినారు. వీరి ననుసరించి నడచిన వారిలో శ్రీ కొల్లూరి హర్షవర్ధనశర్మ శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారలు ముఖ్యులు. కోరుమిల్లి శాసనము, వేమవరము శాసనము లోని "పౌత్రీం కాటయవేమయుక్తి తిపతేః పుత్రీంచ కాట ప్రభోః" యిత్యాది శ్లోక పాదములో తప్పు లున్న వనియు 'పౌత్రీంకాటయవేమయుక్తి తిపతేః పుత్రీంచ కాటప్రభోః' అనునది అపపాఠమనియు సద్దానిని సవ

---

2. శ్రీ లక్ష్మీరంజనం, బాలేందు శేఖరంగార లీవ్రాతను శ్రీ సోమశేఖరశర్మగారి వ్రాతనుబట్టియే వ్రాసి యుందురని శ్రీ హర్షవర్ధన శర్మగారు తమ దృఢాభిప్రాయమును వెలిబుచ్చి యున్నారు. అయితే శ్రీ సోమశేఖర శర్మగారి తొలి వ్రాతలో పొరబాటుపడిరనియో లేక ముద్రణస్ఖాలిత్యదోష మొనగూడినదనియో సమర్థించిన శ్రీ హర్షవర్ధనశర్మగారి వ్రాత యీ మలివ్రాతతో పరాస్తమగుచున్నది.

శ్రీ సోమశేఖర శర్మగారు స్పష్టముగా కాటయ వేముడు హరిహరరాయల జామాత (Son-in-law) అని నొక్కి వక్కాణించుచున్నారు. వారి దృష్టిలో కాటయవేముడు విజయనగరరాజు హరిహరరాయల అల్లుడేగాని వేరుగాదు!

రించి 'పుత్రీంకాటయవేమయక్షితిపతేః పౌత్రీంచ కాటప్రభోః'' యని నిబ్బరించవలెనని, అట్లు సవరించిననేగాని శ్లోకాన్వయము కుదిరి అర్థవంతము గాదనియు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు నూత్న సిద్ధాంతమును వెలార్చి, అట్టి సవరణతోడనే యా శ్లోకము అన్వయింపబడవలెనని ఘంటాపథముగ యెలుగెత్తి చాటిరి. పక్షాంతరమున శ్రీ సోమశేఖర శర్మగారు కూడ శ్రీ ప్రభాకరశాస్త్రిగారిని సమర్థింపుచు వారి పక్షములోననే జేరిరి.

మూలశ్లోకమునకు మార్పు ఘటించుటకు గల కారణమును ''ఈ శ్లోకమునకు తర్వాత శ్లోకమైన కాటయవేమక్షితిపతి తనయా—మనితల్లినామ విఖ్యాతాన్, కమలామివ కమలాక్షః తా ముదవహ దల్ల భూపవీరేంద్రః'' యనుదానిలో కాటయవేముని కూతును యల్లనిగూర్చియే యుండుటచే దీనిపై శ్లోకమునందును మొదటిపదము 'పుత్రీం' అనియే యుండవలయునని నిర్ధారితమగుచున్నది'' యని శ్రీ పాపయ్యశాస్త్రిగారు సమర్థింపుచున్నారు. ఈ సందేహమునకు సమాధానము శ్రీ సాంబశివరామమూర్తిగారు తమ వ్యాసములో చక్కగా, సహేతుకముగా విప్పియున్నారు. వ్యాకరణశాస్త్ర ప్రకారముగూడ నా సవరణ అనుచితమును, అనవసరమనియు తేల్చివేసినారు. అట్టియెడ శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి సవరణకు అవసరమేలేక శ్లోకపాఠము యథాతథముగనే యుంచవలసియుండును. ఆ ప్రకారమైనచో 'హరిహరాంబ' కాటయకూతురు, కాటయవేముని కొడుకుకూతురు (పౌత్రి) హరిహరరాయల కూతురు కూతురు (దౌహిత్రి) యనితేలి, ప్రసక్త శాసన పాఠముతో సరిపోవుచున్నది. కావున శ్రీ ప్రభాకరశాస్త్రిగారి సవరణ అనవసరము: వారుచేసిన సవరణను సమర్థించి, తద్రీత్యా నూతన బంధుత్వమును సృష్టించుటకాని యన్యము గాదు. ఈ సృష్టి చేయుటకుగూడ శ్రీ శాస్త్రిగారికి బలమైన కారణమింకొకడుండవలెను. దానిని వారి మాటలలోనే ఉదాహరించుట మంచిది.

'కొంచెమాగి యందలి యసంగతిని దెల్పెదను. ల్లాడరెడ్డి పెద్దకుమారుడగు వేమారెడ్డికి హరి

---

3. (a) శ్రీ హర్షవర్ధనశర్మగారు శ్లోక పాఠ సవరణ నిట్లు బలపరచుచున్నారు:

'The original Plates of this Grant are now in the possession of the British Museum but the text was carefully checked from the impressions that were received in the office of the Govt. Epigraphist for India some time back. The trend of the text clearly indicates that the composer of the charter speaks of the two daughters of Kataya Vema Reddi only It is obvious that he had altered the readings "Pautri" and "Putri" in a confusion The emendation suggested by the Late Sri V. Prabhakara Sastri Garu seems to be fully justified. (Epigraphica Indica. Vol XXXVI—Page 173.)

(b) శ్రీ చిలుకూరి పాపయ్య శాస్త్రిగారు శ్రీ ప్రభాకరశాస్త్రిగారి సవరణ నిట్లు సమర్థింపుచున్నారు:

'ఈ శ్లోకము చెక్కియున్న రాగి రేకులలో మొదట 'పౌత్రీం' రెండవచోట 'పుత్రీం' అని యున్నది. ఈ శాసనమును దొలుత జదివిన బార్నెటు దొర గారటులనే చదివి, ముద్రించియుండగా కీ॥ శే॥ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు దీనిని సవరించి పైవిధముగా సరిపెట్టియున్నారు. వారు సవరించిన పద్ధతియే సరియైనది. కాటయకు పౌత్రి, కాటయవేమునకు పుత్రి, హరిహరరాయలకు దౌహిత్రియునగు 'హరిహరాంబ' నల్లాడరెడ్డి వేమారెడ్డికి భార్యగా గ్రహింపజేసెనని పై శ్లోకభావము. (కవితాసమీక్ష—రెడ్డిరాజుల చరిత్రము. Pages 193 and 194.)

(c) శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు శ్రీ ప్రభాకరశాస్త్రిగారి సవరణకు తమ ఆమోదము నిట్లు తెల్పుచున్నారు:

'Pandit V. Prabhakara Sastry Garu emends the first line in the above verse as shown below—పుత్రీం కాటయవేమయక్షితిపతేః పౌత్రీంచకాటప్రభోః'' (History of the Reddi Kingdoms, Chap IX. P. 169). I accept the sloka relating to this alliance as emended by Pandit V. Prabhakara SastriGaru(History of the Reddi Kingdoms. Chapter VIII, P. 128.)

హరాంబయను నామె భార్యయనియు, నా హరిహరాంబ కాటయవేమునకు గొడుకు కూతురనియుఁ గాటయకు గూతురనియుఁ జతుస్సముద్రములను వేలుచున్న హరిహర క్షోణిపతికిఁ గూతుకూతురనియుఁ బయిశ్లోకమున కర్థము.......ఆ శ్లోకమిప్పడున్నట్లేయుండునేని, కాటయవేమునకుఁ గాటయ యని కుమారుడు కలడనియు నాతడు హరిహరరాయల యల్లుడనియు, నా కాటయ కూతురు హరిహరాంబయనియు నేర్పడును. హరిహరాంబను బెండ్లియాడిన వేమారెడ్డి యల్లయ్య కుమారుడగుట వీరభద్రారెడ్డి యన్నయగుట మనమింతకు ముందెరుగుదుము. మరియు నా వీరభద్రారెడ్డి, కాటయవేమునికూతురగు అనితల్లికి భర్తయనికూడ నెరుగుదుము. కాటయ వేమారెడ్డి తన యల్లుని యన్నకుఁ దన కొడుకు కూతునిచ్చి వివాహము చేసిన వాడగును. అట్టిది యెక్కడేని సంగతముగా నుండునా? అనితల్లికి మేనకోడలగు హరిహరాంబ తోడికోడలు అయినట్లు. అల్లయవేముని సంబంధమునుబట్టి చూడగా ననితల్లి వీరభద్రారెడ్డికిఁ బినతల్లి యగును. తల్లి వరుస తలపరాదందురు. ఈ శ్లోక మింత యసంగతముగా నున్నది'' (శృంగార శ్రీనాథము—పుటలు 284—288.)

ఈ యసంగత బాంధవ్యమున కెడ మిచ్చు శ్లోకమును సవరించుట శ్రీ ప్రభాకరశాస్త్రిగారి కర్తవ్యమై వారు శ్లోకపాఠమును మార్చినారు. ఈ సందేహమును శ్రీ సాంబశివరావుశాస్త్రిగారు తమ వ్యాసములో దీర్చి హరిహరాంబానితల్లుల వావి నిరూపించి, యది దూష్యముగాదని నిర్ధరించి యున్నారు.

ఈ ఆక్షేపణ దీరగా శ్రీ ప్రభాకరశాస్త్రిగారి మరియొక ఆక్షేపణను సమాధానించవలసియున్నది. శ్రీ శాస్త్రిగారు తమ 'శృంగార శ్రీనాథము'లోనే 'కాటయవేమునకుఁ గాటయ యను కొమారుడున్నట్టు గా నేశాసనమందుగాని, యే గ్రంథమునందుగాని కాన రాదు. ఆతడేమో బాల్యముననే చనిపోయి యుండ వచ్చుననుటకును గుదరదు. ఆతడు హరిహరరాయని యల్లుడట! హరిహరాంబయను కూతును గనెనట! ఈ శ్లోకమునందొక చిన్న తప్పిదము దొరలినదని నేను దలంచుచున్నాను. అది శాసనము చెక్కువారి వలనగాని, దాని జదివి వ్రాసిన వారివలనగాని ప్రస క్తించియుండును. శ్లోకమందలి ప్రథమ చరణ మీ క్రింది విధముగా నుండదగును.

'పుత్రీం కాటయవేమయక్షితిపతేః
పౌత్రీంచ కాటప్రభోః'

శ్రీ శాస్త్రిగారి మతమున కాటయవేమునకు కాటప్రభుడు పుట్టనేలేదు! అట్లపుటచే వాతడొక సామ్రాజ్యాధిపతికి యల్లుడగుట, యొక కూతును గనుట వట్టి మిథ్య! 'గజం మిథ్య, పలాయనం మిథ్య'వతుగా భాసించిన శ్రీ శాస్త్రిగారి నమ్మకము కాటప్రభుని కుమార్తె 'హరిహరాంబ' యల్లయవేమ భూపతిని పరిణయమాయెనని చెప్పు శ్లోకములో తప్పు పట్టువరకు నడిపించినది! ఆ వివాహ విషయమై వారు యదార్థమని విశ్వసింపరు! కావున వారి యూహలకు తగినటుల శాసన మూలపాఠములనే మార్చి సవరణచేసి సత్యమును తారుమారు చేయు సాహసమును అపవాదమొసర్పుశక్తి నీ శ్రీ శాస్త్రిగారు వహించినారు!

కాటయవేమునకుఁ గాటప్రభువన్న తనయుడొకడుండెనని చెప్పినవారు శ్రీ చిలుకూరి వీరభద్రరావు పంతులుగారును శ్రీ చాగంటి శేషయ్యగారు మాత్రమే! శ్రీ వీరభద్రరావుగారు కాటయవేమునకుఁ గాటప్రభువన్న కొమరు డుండెనని విశ్వసించుచునే యాతని యర్ధాంగి విషయనిర్ణయములో మాత్రము పొరబడినారు. శ్రీ చాగంటి శేషయ్యాగారీ విషయమై అదినుండియు సక్రమమార్గమునే అవలంబించి, శాసన మూలపాఠములకు శ్రీ ప్రభాకరశాస్త్రిగా రుపపాదించిన సవరణలను ప్రతిఘటించుచునేయున్నారు. శాసనాంతర సహాయమున కాటప్రభుని యునికినిగూడ వారు నిర్ధారింప దొరకొని కృతకృత్యులైనారు.

దక్షిణ హిందూదేశ శాసనసంపుటము నె 5 రులో (A. R. No. 453 of 1893) తూర్పు గోదావరి జిల్లా కాకినాడ తాలూకా సర్పవర గ్రామములో వేంచేసియున్న శ్రీ భావనారాయణస్వామివారి దేవాలయ ముఖద్వారముకడ నీ క్రింది శాసనమున్నట్లు ప్రకటింపబడినది. ఇందుకొంతభాగము దేవాలయ కుడ్యములో పూడ్చి కట్టబడినట్లు "Part of the inscription is built in" అని శాసన సంపుట ప్రచురణాధికారులు

వెల్లడించినారు. మిగిలిన శాసనభాగ మీ క్రింది విధముగా నున్నది.

1. ... స్యకాటప్రభునమానః। వీరా
2. ... రాజయతి వేమభూపాలః॥
3. ... 1336 గునేంటి జయ సంవత్సర
4. ... వేమారెడ్డింగారి నిజ భృత్యు
5. ... రు తనకు స్వామియైన కాటమ
6. ... [మ]రెడ్డి (వే) మారెడింగారికుమా
7. ... కాటమరెడ్డి వేమారెడ్డింగా...

(అసంపూర్తి)

ఈ శాసనమును అజ్ఞాతముగా మిగిలిపోయిన భాగమును శా॥ శ॥ 1332 నాటి కాటయవేముని అహోబల శాసన సాహాయ్యమునను, శక 1336 నాటి కడియం మాచినేనింగారి శాసన సాహాయ్యమునను శ్రీ శేషయ్యగారిట్లు పూరించినారు.

1. (సప్త కాటయ శౌరేః)
పౌత్రో మారస్య కాటప్రభుప మానః వీరా
2. (స్పష్టోత్సవ తేః జామా)
తా జయతి వేమభూపాలః॥
3. (స్వస్తి శకవరుషంబులు)
1336 గు నేంటి జయసంవత్సర
4. (కార్తిక శు 15 భానువారం)
వేమారెడింగారి నిజభృత్యు
5. (డైన మాచినేనింగా)
రు తనకు స్వామియైన కాటమ
6. (రెడ్డింగారి వే)
మ రెడి (వే)మారెడింగారి కుమా
7. (రుండయిన)
కాటమరెడి వేమారెడింగా....(అసంపూర్తి)

శ్రీ శేషయ్యగారి పూరణతో సమగ్రమై నిలిచిన శాసనపాఠమునుబట్టి కాటయవేమునకు 'కాటమ రెడి యను' కుమారుడున్నట్లు స్పష్టమగుచున్నది. అందుచే శ్రీ శాస్త్రిగారే ప్రాతిపదికపై అల్లాడ వేమారెడ్డి కోరుమిల్లి శాసనమును సవరింప యత్నించిరో ఆ ప్రాతిపదిక నిరాధారమైనట్లు తేలు చున్నది. కావున కాటయవేమునకు 'కాటప్రభు'వను కుమారుడున్నట్లు నిస్సంశయముగా నిర్ణయింపనగు చున్నది. శ్రీ శేషయ్యగారి శాసన పూరణము దోష భూయిష్ఠమనుటకుగాని, లోపభూయిష్ఠమనుటకు గాని యెట్టి ఆధారములున్ను కనబడవు.4 ఏ శాసన సాహాయ్యమున శ్రీ శేషయ్యగారీ అసంపూర్ణ భాగమును పూరింపనుద్యమించిరో ఆ శాసనములకును పై నుదహరించిన సర్వవరపు శాసనమునకును పోలికలుండుటయేగాక, అందలి శ్లోకములే యిందుఁబాడ నుదహరింపబడుట గమనార్హము. కడియం మాచినేనిగారి శాసనమును ప్రసక్త శాసనమగు సర్వవరశాసనము నాటి దినమున సీయబడిన వాటచే శ్రీ శేషయ్యగారు పూరించిన మాటలు సరియైనవనియే తప్పక నిర్ణయింపవలసి యున్నది. ఇపు డుపలభ్యమైన పినపళ్ల తామ్రశాసనముకూడ కాటయవేమునకు కాటయ ప్రభువను కొమరుడొకడుండెనని స్పష్టీకరించు చున్నదిగదా!

శ్రీ ప్రభాకరశాస్త్రిగారి సవరణ యింకొక విధముగాకూడ అనుచితమని తేలుచున్నది. ఈ అనుచి

4. 'సగమునకుపైన పోయిన శాసనమును బట్టి శేషయ్యగారు గావించిన నిర్ణయము అంగీకరించుట సమంజసమని తోచుట లేదు. ఆ రెండు అసంపూర్తి శాసనములను శ్రీ శేషయ్యగారి సవరణలను చూచినాను. నా ఉద్దేశ్యమున ఆ రెండు శాసనములు కాటయవేమునివేగాని, అతని పుత్రునివి కావు. ఆ మొదటి శ్లోకము 'సప్తకాటయశౌరేః' అనునది కేవలము కాటయవేముని శాసనములందే కాన్పించును. మరియు కాటయవేమారెడ్డి కొడుకుని దెల్పినను కొన్నను అతడు వేమారెడి కావలెను కాని శ్రీ శేషయ్యగారు తలంచునట్లు కాటయరెడ్డికాదు' అని శ్రీ హర్షవర్ధనశర్మగారీనిర్ణయమునకు తమ పూర్తి వ్యతిరేకతను వెలిబుచ్చియున్నారు. ఇందులకు కారణము కాటయవేమునకు కాటయ ప్రభువను కొమరుడు లేడను వారి గట్టి నమ్మకమేగాని అన్యము గాదు. ఆ కారణము వలననే వారు శ్రీ ప్రభాకర శాస్త్రిగారి పక్షమువహించి, శ్లోక సవరణను సమర్థింప దొరకొన్నారు.

తత్వ వివారణ శ్రీ సాంబశివరామమూర్తిగారిట్లు చేసి యున్నారు.

'అనితల్లి కలువచేరు శాసనములో—అనితల్లి పతిదైనా ఘనసద్వినీతభావుకా భువనవతీ—యని యుండుటచే రాజ్యాధికారిణి అనితల్లి, బావగారైన (వేమారెడ్డి) ముఖ్యమంత్రియనియు తెలుచున్నది గదా? దానికితోడు 'కాటయవేముని తరువాత నాతని పుత్రసంతానము నిలచియుండని కారణముననే, అతని పుత్రికయైన అనితల్లికి అల్లాడరాజ్య సంక్రమము గావించెననిమాత్రము కలువచేరు శాసనశ్లోకమునుబట్టి తెలియుచున్నది.' అని కవిత సమీక్ష 103, 104 పేజీలలోనే యుదహరించియున్నారు. అనగా కాటయవేముని తరువాత అతని పుత్రసంతానములేదనియు, అనితల్లిమాత్రమునిల్చి రాజ్యాధికారిణి యయ్యెననియు ధ్రువమగుచున్నది. అట్లుగాకనిజముగా హరిహరాంబ కాటయవేముని కూతురే అయినచో నామె పెద్దవాడైన వేమునికే గదా ఇయ్యబడినది. అనితల్లి భర్త వీరభద్రుడు వేమునికంటె చిన్నవాడేగదా? అన్నచెల్లెండ్ర నిరువురను (సావిత్రి సోదరులు) అన్నదమ్ముల కిర్వురకును వివాహము చేయునపుడు పెద్దవానికి పెద్దకొమార్తెను, చిన్నవానికి చిన్నకూతురును వివాహము జరిగియుండవలెను. అట్టితరి పెద్దవాడైన వేముని భార్య హరిహరాంబ పెద్దకూతురు గావలెను. అపుడు కాటయవేముని తరువాత ఆ రాజ్యము పెద్ద కూతురైన హరిహరాంబకు సంక్రమించవలెను. అట్లు గాక చిన్నవాని భార్యయైన అనితల్లికి సంక్రమించుటచే నిజముగా అనితల్లి మాత్రము రాజ్యాధినేతయైన కాటయవేముని కూతురని నిర్ణయించిరి. అనితల్లి కంటె హరిహరాంబ పెద్దదగుటచే పెద్దవాడైన వేముని కీయబడెను. ఆమె తండ్రియైన కాటయ దేశమేలిన ప్రభువుకాకపోవుటచే నీ రాజ్యమామెకు సంక్రమింపక చిన్నదైనను కాటయవేమ నృపాలుని కూతురగుటచే నామెకే సంక్రమించెనని ధ్రువమగుచున్నది. ఎన్నివిధముల యోజించినను హరిహరాంబ కాటయవేముని పౌత్రిగాని పుత్రి కానేరదు'అని రాజ్య సంక్రమణ సూత్రాధారముగా కూడ నీ విషయమును పరిష్కరించియున్నారు.

శ్రీ సాంబశివరామమూర్తిగారి హేతువాదమొక విధముగా సమంజసముగా కాన్పించుచున్నది. కాని—శ్రీ మూర్తిగారు కోరుమిల్లి శాసనములోని 'తన్నామ్నా విదితాహ్వయాం హరిహరాంబాం చారుమగ్రాహయత్ప్రాజ్ఞో వేమమహీశమల్లనృపతిస్సామ్రాజ్యలక్ష్మీసమం' అన్న శ్లోకార్థమును విస్మరించి, వాదన సాగించినారని చెప్పవలసి వచ్చినందులకు విచారించుచున్నాను. వారి వాదనలో సామ్రాజ్యలక్ష్మి అనితల్లికి సంక్రమించినందువలన యామె కాటయవేమునికి కూతురై యుండియుండవలెననియు హరిహరాంబ కాటయవేముని పెద్దకూతురై యున్నను (వాదనకొరకు అంగీకరించినను) రాజ్యాధికారిణికాని కారణమున యామె కాటయ వేముని కూతురై యుండియుండదను అభిప్రాయము చేతనే యామె కాటయవేముని పౌత్రియై యుండవలెనన్న అభిప్రాయము శ్రీ మూర్తిగారు పడిరని తేలుచున్నది.5

శ్రీ మూర్తిగారి అభిప్రాయమునకు ఖండనముగానున్న శ్రీ శర్మగారి అభిప్రాయములను విమర్శించి, నిర్ణయము చేయవలసియున్నది. అట్లుండననేగాని శ్రీ మూర్తిగారి వాదన నిలువదు. కావున శ్రీ శర్మగారి వాదనకు సమాధానమీయ ప్రయత్నింతును.

కాటయవేముని కుమారుడు కొమరగిరి యనంతరము రాజమహేంద్రవర రాజ్యముపై అనితల్లికే హక్కుగలదనియు, అందులకు కారణము ఆ రాజ్యము అనితల్లి మాతామహార్జితమై యుండుటయే యనియు, న్యాయముగా అనితల్లికి సంక్రమింపవలసిన రాజ్యమును అల్లాడభూపతి దురితరహిత

---

5. ఈ యూహాసేతకు శ్రీ హర్షవర్ధనశర్మ గారి ప్రతివాద మీ క్రింది విధముగా నున్నది.

'ఈ శాసనములోని 'అల్లనృపతిః వేమం హరిహరాంబాం సామ్రాజ్య లక్ష్మ్యాసమం అగ్రాహయత్' అను అన్వయము కడు ముఖ్యమైనది. సామ్రాజ్య లక్ష్మితో హరిహరాంబను గ్రహింపజేసెను. అట్లే 'అన్నితల్యాం న్యధత్త' అనునది ముఖ్యమని నా యూహ. అని వారిరువురు కాటయవేముని పుత్రికలు కానివాడు అసంభవము. కాటయవేముని కొడుకు కూతురైన పక్షమున ఆ విశేషణ మనవసరము' అని హరిహరాంబ కాటయవేముని పౌత్రికాదు, పుత్రి యనియే శర్మగారు నుడువుచున్నారు.

చిత్తుడై అనితల్లికి సంక్రమింపజేసెననియు నింత వరకు ప్రామాణిక చరిత్రకారులందఱును ముక్తకంఠముగ చాటియున్నారు. అట్టి సందర్భములో 'సామ్రాజ్యలక్ష్మితో' కూడుకొన్నది 'అనితల్లి' గాని 'హరిహరాంబ' కాదు గదా! హరిహరాంబ కాటయ వేముని కూతురైనను (వాదనకొఱకంగీకరించినను) రాజమహేంద్రవర రాజ్యమున కుత్తరాధికారిణి యగుట లేదు. ఆ రాజ్యమామెకు మాతామహార్జితముగాదు. కావున హరిహరాంబ "సామ్రాజ్యలక్ష్మి" తో కూడుకొనుట పొసగని విషయము. కాని శ్రీ శర్మగారనినట్లు 'హరిహరాంబాం సామ్రాజ్యలక్ష్మ్యా సమం అగ్రాహయత్' యను దానికి అన్వయము కుదుర వలెనన్న ఆమెకుకూడ రాజమహేంద్రవర రాజ్యముపై 'అనితల్లికి' యెట్టి హక్కుగలదో యట్టి హక్కే కలిగియుండవలెను. అదెట్లులో వివరింపవలసి యున్నది.

కాటయవేముడు మరణించునప్పటి కాతని మిగిలిన పుత్రుడు కొమరగిరి. కాటప్రభుడు తండ్రి జీవితకాలములోనే మరణించియున్నాడు. (శ్రీ శాస్త్రి గారు అసలు కాటయ జన్మించియే యుండలేదని వాదించియున్నారు.) కావున రాజమహేంద్రవర రాజ్యమునకు కాటయవేముని యనంతరము కొమరగిరి ఉత్తరాధికారియగుట సహజము. కాటప్రభువే బ్రతికియున్నచో నాతడే రాజ్యము నాక్రమించి రాజ్యపాలనాధికారము వహించియుండెడువాడు. ఆ పరిస్థితులలో కాటప్రభువు అనంతరము కుమారగిరి రాజ్యమునకువచ్చి యుండవలసియుండును. అట్లుగాక—కాటప్రభువు తండ్రికంటె ముందుగా దివంగతుడైనందున కాటయవేముని తరువాత కొమరగిరి రాజగుట తటస్థించినది. కొమరగిరికి సంతానము లేకపోవుటచే వాతని సోదరుడు కాటప్రభువు పుత్రిక (కొమరగిరి వంశమునకే రాజ్యము చెందవలెనుగాన యా వంశములో నిలిచియున్న కాటప్రభుపుత్రిక) హరిహరాంబ రాజమహేంద్రవరరాజ్య సింహాసనము నధిష్ఠింప నర్హురాలైనది. కాని రాజమహేంద్రవరరాజ్యము 'అనితల్లి' మాతామహార్జితము అయినందునను, కొమరగిరికి సంతానము లేనందునను, తల్లిదండ్రులబట్టి చూచిన 'అనితల్లి'ని రాజమహేంద్రవర సింహాసనమునకు సన్నిహితవారసురాలుగా గణుతింపవలసిన పరిస్థితి యేర్పడినది. వ్యాయుతః తండ్రి తరువాత పుత్రికకు రావలసిన యక్కర 'హరిహరాంబ'యందు ప్రబద్ధమైయుండ మాతామహార్జితముగా 'అనితల్లి'కి రాజ్యముపై హక్కు యేర్పడినది. అందుచేతనే 'హరిహరాంబ' సామ్రాజ్యలక్ష్మితో కూడుకొనినదైనది. ఈ వివాదము విస్తృతము కానిచ్చినచో సామ్రాజ్య స్థితికి భంగము వాటిల్లునని గ్రహించిన అల్లాడభూపతి వయోభేదమును ననుసరించి 'అనితల్లిని' వీరభద్రునకు 'హరిహరాంబ'ను వేమభూపాలునకు ధర్మపత్నులుగా స్వీకరింపజేసి ఇరువురకును రాజమహేంద్రవర రాజ్యముపై గల హక్కులకు సంఘర్షణ (Conflict) కలుగకుండ వారించి, రాజ్యసుస్థిరతను తన రాజకీయచతురతతో, దూరదృష్టితో, పరిజ్ఞానముతో నిబ్బరించినాడు. ఈ సమన్వయమార్గ మవలంబించుటలో నిరువురకును సింహాసనముపై గల హక్కులు త్రోసిపుచ్చబడలేదు! అట్లు కాదేని—'హరిహరాంబ'యే విజయనగరరాజుల దౌహిత్రి, కాటయవేముని దుహితయు నైననాడు 'అనితల్లి'తోబాటు సమానహక్కుగలదిగా నగుచున్నది. ఆ పరిస్థితిలో మాతామహార్జిత ప్రసక్తికంత బలముండక, బలమున్న వానిదే రాజ్యము అను పరిస్థితి కలిగియుండెడిది. మహాబలవంతులగు విజయనగర ప్రభువులు తమ పౌత్రి 'హరిహరాంబ' పక్షముబూని 'అనితల్లి' పక్షమునుక్రిందుజేసియుండియుండెడువారు! కుమారగిరిసోదరియైనంతమాత్రమున 'అనితల్లికి' వేరు ప్రత్యేకమైన హక్కుగాని, అధికారముగాని సంక్రమించి యుండదుగదా! పైగా కుమారగిరికి సంతానములేని కారణమున నాతని సోదరుని సంతానమే యాతని సంతానముక్రింద పరిగణింపబడి, వారికి రాజ్యాధికారము చేపడవలెనుగాన కొమరగిరి సోదరుడు కాటప్రభుపుతనయ 'హరిహరాంబ'కే రాజ్యాధికారము సంక్రమించవలెనుగదా! కావున హరిహరాంబకు రాజమహేంద్రవరరాజ్యముపైగల హక్కును నేను పై పేర్కొన్న చందమున సంక్రమించుటచే, అల్లాడరెడ్డి యొనర్చిన వైవాహిక విధు లుభయతారకములుగా నుండి, కుటుంబ కలహమును వారించి, సంఘర్షణ నుపశమింప సమర్థములై యున్నందుననే యట్టి అధికార నిరూపణ యత్నములో విజయనగర ప్రభువులు

నిమగ్నులు కాలేదు! 'అనితల్లి' కలువచేరు శాసనములో రాజమహేంద్రవరరాజ్యము కాటయవేముని కుమారుడు కొమరగిరి మరణానంతరము కొంతకాలము రాజకీయ కల్లోలమునకగ్గమై, స్వామిద్రోహపరాయణులగు కున్నృపతివర్గ దౌష్ట్యములంజిక్కి అటమటించినట్లు సూచింపబడుట యీ వివాదకు సంబంధించినదై కూడ నుండనోవు!

ఈ విధముగా శ్రీ శర్మగారి అభిప్రాయాను గుణముగా 'హరిహరాంబ'కు సామ్రాజ్యలక్ష్మి చొప్పడిన విధానము వివరింపబడినది. గాన శాసనశ్లోకములలో నుదహరింపబడిన 'సామ్రాజ్యలక్ష్మ్యైసమం' యను విశేషణము 'హరిహరాంబ' కాటప్రభువు కుమార్తె యైనవాడే యర్థవంతమై, అన్వయసాధ్యమగుచుండుటచే 'హరిహరాంబ' కాటయవేముని కుమార్తెయైనవాడేగాని యీ విశేషణము సార్థకముగుట సంభవింపదనియు, లేనిచో కాదనియు చెప్ప శ్రీ శర్మగారి వాదము నిర్వీర్యమగుచున్నది. అందుచే 'హరిహరాంబ' కాటయవేముని పౌత్రి, కాటయపుత్రి, హరిహరరాయల దౌహిత్రియను యర్థము నిచ్చు మూలశ్లోకమే సరియైనదనియు, వారి కొనరింపబడిన సవరణ లనవసరములు, అసంగతములునని యెంచుకోవలసి యుండును. ఆ విధిని కాటయ వేమునకు కాటప్రభువను కొమరు డొక డుండియుండెననుట నిశ్చితార్థము: ఈ యదార్థము నొప్పుకొన నిచ్ఛగింపని శ్రీ శాస్త్రి ప్రభృతులు శాసనపాఠములో తప్పులున్నవని వారి యూహలకు సరిపడు తెలుంగున శ్లోకపాఠముల సవరించి, అయోమయస్థితిని కల్పించినారు!

కోరుమిల్లి, వేమవరశాసనములలో నుద్ఘాటించిన విధముగా 'హరిహరాంబ' కాటయవేముని పౌత్రి, కాటప్రభుని పుత్రి, హరిహరరాయలదౌహిత్రి యన్న సత్యమును నిర్ద్వంద్వముగా యేకవాక్యతగా ఋజువుచేసిన 'పినపళ్ల తామ్రశాసన' మీ దృష్టిలో నెంతయో ప్రయోజనకారియు ప్రధానము నని చెప్పుటకు వెనుదీయ నవసరములేదు.



**కథానిక:**

# ఇంటి కోసం

శ్రీ బలివాడ కాంతారావు

విశ్వనాథం అద్దె యిళ్లల్లోనే పెరిగాడు. ఉద్యోగంలో చేరాక అద్దెయిళ్లల్లోనే జీవితం గడిపాడు. పెళ్లీడు కొచ్చిన పెద్ద కూతురితోపాటు లేకలేక నలుగురు ఆడపిల్లలతరువాత కలిగిన కొడుకూ అద్దె యిళ్ల ల్లోనే పుట్టారు. బహుశః ఎప్పుడో ఒకనాడు జీవిత నాటకంలో చివరి రంగాన్ని అద్దెయింట్లోనే ఆడతా ననుకున్నాడు.

అలా అనుకునే సమయంలో ఒక మిత్రుడు తారసపడి . . .

'అద్దె యిళ్లల్లో అవమానపడే ఖర్మ నీకేం వచ్చింది ?'

'నా బతుక్కి సొంత యిల్లొకటా?'

'నువ్వు చెయ్యి చాచకండానే యిలాంటివి నాలు గిళ్లు కట్టగలిగే సీటులో వున్నావ్—ఊఁ అను ఎవడో ఒకడు కట్టించి మరీ నీకు అప్పజెబుతాడు.'

విశ్వనాథం ముఖం కోపంతో నిండిపోతుంటే—

'నిన్ను లంచాలు తీసుకోమని నే ననలేదు· నీలాంటి ఆనెమ్టు ఉద్యోగికి తప్పకుండా ఒక యిల్లు యిస్తారు. అప్లికేషను పెట్టు...నీ జీతం సంవత్సరా నికి ఆరువేలు దాటిందికదూ?'

'మొన్ననే—'

'అయితే టౌన్ ప్లానింగ్ ట్రస్ట్ వాళ్లు యిళ్లు కట్టించి మరీ యిస్తున్నారు. ముందు వెయ్యి రూపాయలు అప్లికేషనుతో కట్టాలి. ఇల్లు నీ కిస్తా మని కబురొచ్చాక మరో నాలుగువేలు కట్టు. ప్రతీ నెలా నువ్విచ్చే యింటిఅద్దె దానికి కడితే—యిరవై సంవత్సరాల్లో యిల్లు నీదై పోతుంది.'

'ఇప్పు డైదువేలు యెక్కడ లేను?'

'ఈ మధ్యనే కూతురి పెళ్లి చేయాలని అప్పు ప్రావిడెంట్‌-ఫండ్ నుంచి తీసావ్ కదా! సంబంధా లొచ్చాయా?'

'వాచ్చాయి బాబూ వచ్చాయి...అంత యిచ్చుకో లేనంటే మాటాడకుండా పోయారు.'

'వాళ్లు అడిగిన దేమిటి ?'

'అన్నీ హిరణ్యాక్ష వరాలు...ఒక స్కూటరు.... ఇంకొకడికి రేడియోగ్రాం కూడా కావాలట. పిల్లకి బాలతొడుగు యిరవై తులాలు—ఐదు వేల కట్నం—నాలుకకు మెదడుకు సంబంధం లేని మనుషులు. నా కొడుకు పెళ్లికి ఒక పైసాగూడా పుచ్చుకోనంటే పుచ్చుకోను.'

'పెళ్లి రెండేళ్లు ఆగనీ. పిల్ల యెలాను చదువు కుంటోంది కదా ? ఒక యిల్లుముక్క చేసుకో—ఇంతకంటె మనలాంటి వాళ్లకు అదును దొరకదు.'

'ఆలోచించి రేపు చెప్తాను.'

ఈ ఆలోచనలో ఆతని కళ్లయెదుటయిన్నాళ్లూ తను అద్దె యిళ్లల్లో గడిపిన యమయాతన అంతా ప్రత్యక్షమైంది.

ఒక పెద్ద లోగిలిలో ఐదు కుటుంబాలు. ఒక నీరూ లేదు. నిప్పూ లేదు. ఐదు సంవత్సరాలైనా వెల్ల వేసిన పాపాన పోలేదు. ఎలక్ట్రిక్ దీపా లున్నా యంటే కామన్ మీటర్. ప్రతి నెలా కరెంట్ డబ్బు కోసం కొట్లాటే. ఇంకో యింకో యింట్లోకి కదల గానే ఆ ఇంట్లో యింటివాళ్లొక వాటాలో వున్నారు. గోడకు ఒక మేకు కొట్టినా, దీపాలు తొమ్మిదిదాటి

వెలిగించినా, వేసవిలో టేబిల్ ఫేన్ తిరిగినా తగువు లొచ్చేవి. ఇంటికి చుట్టాలొచ్చి దొడ్డివాడినా గందరగోళమే. ఇంత అద్దెయిచ్చి యీసడింపుమాటలు పడలేక యింకో యింటికి వెడితే వాళ్ల యింట్లో యేదో బంగారం పోతే తన పిల్లలమీద అనుమానపడి, పిల్లి మీాద కుక్కమీద వేసి నోరు జారేసుకొనేవారు. అద్దె యిచ్చుకొని అవమానాలు పడలేక, మిగతా ఖర్చులు తగ్గించుకుని తన ఒక కుటుంబం వుండటానికి, కాస్త హెచ్చు అద్దె యిచ్చి ఒక యిల్లు తీసుకున్నాడు. ముందుకు సర్దాగా పూలమొక్కలు నాటాడు. పెరట పాదులు తగిలించాడు. పాదులు యిల్లెక్కాయ్. బిందంత అనపకాయలు, అరగజం పొడవు బీరకాయలు తెగ కాశాయ్. ఇల్లెక్కి కాయలు తెంపి పెంకులు విరిచారని యింటాయన యిల్లు ఖాళీ చేసేమన్నాడు. విరిగినవి కొద్ది పెంకులే. తను తినకండా తెలిసిన వారికందరకూ పండిన కాయగూరలు పంచాడు. ప్రతిఫలం—యిల్లు ఖాళీ చెయ్యాలి. వెతుకుతున్నాడుగానీ యింకే యిల్లూ కుదరలేదు.

ఇలాంటి పరిస్థితులలో కూతురు పెళ్లికన్నా యిల్లే ముఖ్యమని తోచింది. వెయ్యి రూపాయలు అప్లికేషన్‌తో చెల్లించాడు.

ఇల్లు తయారయ్యేసరికి ఇంకో ఆరేళ్లయినా పడుతుంది. ఈ లోగా యీ యింట్లోనే వుండటానికి ప్రయత్నించినా యింటి యజమాని కాదన్నాడు. ఏదో ఒక మిషపెట్టి యింటి యజమాని యిల్లు ఖాళీ చెయ్యించడానికి పెట్టుకున్నట్లుంది. అతనితో పేచీకి దిగకుండా యెలాగో యింకో యింటికి బస మార్చాడు. తను ఖాళీచేసిన యింటిమీద మరో పాతిక వేసి అద్దెకు యిచ్చాడు యింటి యజమాని.

మిత్రుడు యెప్పటికప్పుడు యింటి గురించి సమాచారం అందిస్తూనే వున్నాడు. అప్లికేషను పెట్టిన తొలిరోజుల్లో బొమ్మతో అందంగా వేసిన యిల్లు తనకు అందిచ్చినట్లే అనిపించింది. రాను రాను మాటలు అంత ఆశాజనకంగా లేవు.

'వాళ్లు కడుతున్నవి ముప్పైయ్యైదు యిళ్లు: వచ్చిన అప్లికేషన్లు నూటయాభై వేలుగట..అందులో మంత్రుల చుట్టాలు, అందులో పనిచేసే వుద్యోగుల స్నేహితులు, ట్రస్టు మెంబర్సే అప్లికెంట్సయ్యా... ఈ రోజుల్లో వుద్యోగుల యిన్‌ఫ్లూయన్స్ లాభం లేదు—కలెక్టరు చెప్పినా లాభంలేదు. పొలిటికల్ యిన్‌ఫ్లూయన్స్ వుండాలి...రికమెండేషన్లు లేకుండా ఒక బంట్రోతుకు బదిలీ కాదు. మన బ్రతుకంతా యిన్‌ఫ్లూయన్స్‌తో వుంది—అలా మడి గట్టుకుని కూర్చోకు. అవతలివాళ్లు అనెస్టుగా సెలెక్షన్‌చేస్తే నువ్వు పొలిటికల్ యిన్‌ఫ్లూయన్స్ చేస్తే తప్పు. అందరూ యిన్‌ఫ్లూయన్సు చేసేటప్పుడు నువ్వు చేస్తే తప్పేంవుంది? ఈ అవకాశం జారవిడిచావో జీవితకాలం అద్దెయిళ్లల్లో బాధపడతావు...నీ యిల్లు చూసి నీ కూతుళ్లకి సంబంధాలొస్తాయ్... నా మాట నేను..నువ్వేనా .కాస్త చెప్పు తల్లీ నీ మొగుడితో.. 'ఆనెస్టీ' అంటూ కూర్చుంటే యెలా? మనమేం వూరకనే యిల్లు యిచ్చేమనలేదుకదా? మనకు అన్యాయం జరక్కుండా ఒకమాట వాళ్ళ చెవుల్లో వెయ్యిస్తున్నాం—అంతే!'

మిత్రుడు గంటసేపు గడగడా—యిలా వివిధ భంగిమలతో యిచ్చిన ! ఉపన్యాసం మౌనంతో విశ్వనాథం విన్నాడు.

'సరా....'

'నువ్వు వూఁ..అన్నావంటే..మరెవరూ కాదు. నీ దగ్గరకు తరచు వస్తూంటాడే...ఆ నల్లటి యెంబాసిడర్ కారులో...కంట్రాక్టరు...ఒక్కమాట అన్నాడంటే వెంటనే ఆ యమ్. యల్. ఏ. దగ్గరకు పరుగెత్తుతాడు. ఆ యమ్. యల్. ఏ. మంత్రివర్గానికి కుడిభుజంలాంటివాడు. ఒక్కమాట టౌన్ ప్లానింగ్ అధికారి చెవిలో వేసాడంటే నువ్వు యింట్లో దిగడానికి ముహూర్తం పెట్టుకోవచ్చు.'

'సరే...వెళ్లు..'

'చెప్పడం నావిధి. చెప్పాను...ఇక నీ యిష్టం. ఆలస్యం అయితే రికమెండేషన్స్‌లిస్టులో నువ్వు క్రింద వుంటావ్...ఏమమ్మా...ఏంచేసినా వేగం చెయ్యాలి. ఆలస్యమయితే కార్యాలు చెడిపోతాయ్...నువ్వు కాస్త నచ్చచెప్పు. ఇందులో అన్యాయం ఏమీలేదు.''

ఇంతచెప్పిన మిత్రుడు మెల్లగా కదలిపోయాడు. ప్రక్కగదిలో పిల్లలు చదువుకుంటున్నారు. ఈగదిలో యిద్దరూ మౌనంగా కూర్చున్నారు. కాస్సేపయ్యాక భార్య మెల్లగా 'ఏమి ఆలోచించారండి'. విశ్వనాథం

నెమ్మదిగా నాసంగతి నీకు తెలీదా అన్నట్లు ఒకసారి ఆమెవేపుచూసి మౌనంలో పడ్డాడు.

నిజమే. అతని సంగతి ఆమెకే బాగా తెలుసు. విశ్వనాథంతండ్రి ఆస్తిపాస్తులు గడించకపోయినా వున్న వొక కొడుకును తను నడచిన నీతి బాట గుండా నడిపించే ఆదర్శమూర్తి అయ్యాడు. ఎలాగ గడించి తిన్నా యివేళ తిన్నతిండి అరిగిపోయి తెల్లవారితే కడుపు పరగడుపే అవుతుంది. పరగడుపుతో వున్నప్పుడు రాత్రి తిన్నతిండి జ్ఞప్తికి వచ్చి గర్వపడితే అదే తృప్తియిస్తుంది. ఆ తృప్తితో యిన్నాళ్లు బ్రతికిన విశ్వనాథానికి యివేళ స్నేహితుని మాటలు వెగటుగా తోచినయ్.

"ఇరవైయేళ్లు కష్టపడ్డారు—ఇప్పుడైనా కాస్త నిబ్బరంగా యిల్లు చేరి సుఖపడండి" అంది భార్య.

విశ్వనాథం కుర్చీమీదనించి లేచి యిటూ అటూ గదిలోనే తిరుగుతున్నాడు.

ఒకాయనికి ఒకసారి వుపకారం చేసాడు. డబ్బు తీసుకోడుకదా అని ఒక దంతంతోచేసిన బుద్ధవిగ్రహం తెచ్చియిచ్చాడు. వద్దన్నా వదలిపోయాడు. రెండురోజుల పాటు అంత చల్లని విగ్రహం యింట్లో వున్నా అతనికి నిద్దరపట్టలేదు. మూడోరోజు తెల్లారేసరికి దాన్ని విరిచేబోతే భార్య అంది. "మీ కక్కర్లేకపోతే యెవరికైనా దానం చెయ్యకూడదా?" ఆ ప్రశ్నతో తన చేతి డబ్బు ఖర్చుపెట్టి యిచ్చినవాడికే మళ్లీ రిజిస్టర్డు పార్శిల్ ద్వారా పంపేసాడు. మా తోటలోపండాయని ఒకాయన అరడజను కొబ్బరికాయలు తెచ్చియిచ్చాడు. వద్దన్నా వదలివెళ్లాడు. వాళ్ల నంతవరకు 'సాగనంపి తలుపువేసి ఆగాడు. వచ్చిన యిద్దరూ అనుకుంటున్నారు. 'బజారులో వాడిదగ్గరే మరో అరడజనుకొని గుమాస్తాయింటికి తీసుకువెడదాంరా...'"

ఈ మాటలు విన్నవెంటనే వాళ్లను తలుపుతీసి పిల్చాడు. ఆ కొబ్బరికాయలు వాళ్లకిచ్చి పంపించాడు. తన పేరుచెప్పి డబ్బుతీసుకుని, వుద్యోగాలిస్తామని తన యింటికి వచ్చినవ్యక్తి చెయ్యగానే విశ్వనాథానికి మనుషుల మాటలమీద నమ్మకంపోయింది. ఆవేళనించే యీవిషయాల్లో చాలాజాగ్రత్త పడసాగాడు. తన మటుక్కు తను పూచీపేచీలేకుండా నిజాయితీగా బ్రతుకుదామంటే వీ ల్లేకుండావుంది.

అలా అటూ యిటూ తిరుగుతున్నప్పుడు భార్య మళ్లీ అంది.

'అత నన్నది నిజమే. మనం వూరకనే యిల్లు యిమ్మని అనలేదుగా—మనకి అన్యాయం జరక్కుండా ఒకమాట వేస్తున్నాం—అంతే.'

ఎగిగించి పెళ్లాంవేపు ఒకసారిచూసాడు.

'ఎంత ప్రయాసపడితే యీ యిల్లు అద్దెకు దొరికింది! ఈ రెండుగదులకీ మీ జీవితంలో ఐదో వంతు పోస్తున్నాం. వాళ్లకీ మనకీ ఒకేదొడ్డి. ఒకే గుమ్మం. ఈ యింట్లో కాలుపెట్టిన దగ్గిరినుంచి నాకు భయంగానేవుంది. ఇంటియజమాని క్షయరోగంతో బాధపడుతూ...ఆ దొడ్డే వాడుతున్నాడు. పిల్లలున్నారన్న జాగ్రత్తయినా లేకుండా యెక్కడికక్కడే దగ్గుతూ వూసేస్తున్నాడు. ఫినాయిలు మన యింటి దగ్గర అతని వుమ్ములమీదవేస్తే ఆవిడగారికి కోపం వచ్చింది. ఒకరోజు మాటాడితే రెండోరోజు మాటాడరు. మనం యిల్లు ఖాళీచేస్తే మరో యిరవై అద్దె పెంచుతారట...పిల్లడు విన్నటినించి దగ్గుతూంటే నాఒళ్లు చచ్చిపోతోంది...ఇంట్లో ఒకరికొచ్చినట్లు కాదు. ఆ ముసలాడి అజాగ్రత్తకి మనమంతా బలౌతాం; కాదనకండి.'

'ఇంకో యింటికి పోవచ్చుగా—'

'రానురాను రక్తం వల్చబడుతోందండీ..అనవసరంగా యీ యింటివాళ్ల మూతివిరుపులూ మద్దముఖాలూ నేను చూడలేనండీ. ఊరంతా తిరిగిన కుక్క ఒకిమూలకు చేరుకుంటుంది.. రోజంతా యెగిరినపక్షి ఒకగూటికి సాయంత్రం అయేసరికి ఆశతో చేరుకుంటుంది.. మనకో.. యెల్లప్పుడూ యీబాధ తప్పటంలేదు.. మీకు పుణ్యం వుంటుంది. అందరి బాధలువిని సహాయం చేస్తున్నారు ... మీ భార్యా—పిల్లలగోడు కూడా కాస్త వినండి. నా ఒక్కగాని ఒక్క కొడుకునైనా కాస్త మంచి వాతావరణంలో పెరగనివ్వండి.'

ఆ రాత్రంతా విశ్వనాథం ఆలోచిస్తూనేవున్నాడు. నిజానికి తన నిజాయితీ భార్యా—పిల్లలను కూడా పరీక్షలపాలు చేసింది. ఒకరిచ్చిన పళ్లూ, బిస్కట్లూ తిరస్కరించినవాడు, తను కొని అవినోరూర్చే పిల్లలకు పెట్టలేకపోయాడు. వేసవిలో ఫేనుకింద పడు

కొందామనే కోర్కె పిల్లలకున్నా తను తీర్చలేక పోయాడు. ఇంటి అద్దె, వచ్చే చుట్టాలకు మర్యాదలూ, యింటి ఖర్చూ, వీధిలో ఖర్చు అంతా కూడితే ప్రతి నెలా జీతం బొటాబొటీగా సరిపోతుంటుంది. పిల్లలతో సరదాగా ఒక సుందరమైన ప్రదేశానికి పోయి గడుపుదామనుకున్నా, ఒక సినిమాలో హైక్లాసులో కూర్చుందామన్నా వీలుపడటంలేదు. భార్యా పిల్లలకు సరిఅయిన బట్టలు లేవని తెలిసి మరీ యేమీ చెయ్యలేకపోతున్నాడు. తన నిజాయితీ యింత ఖరీదైన యేనుగని యిదివరకెప్పుడూ అనుకోలేదు. భార్య యివన్నీ మౌనంగా భరించింది. ఏనాడూ యేదీ కోరని యిల్లాలు యీనాడు పిల్లలపైనున్న మమకారంతో ఒక యిల్లు వూరకనే కాదు—డబ్బులో కొనుక్కోడానికి అనుకూలమైన ఒక చిన్న మాట అధికారి చెవిలో వెయ్యమంటోంది. కొడుకుమీద మమకారం, భార్యమీద జాలి—తమందరికీ ఆలస్యంచేస్తే క్షయరోగం రావచ్చన్న భయం, వెతికినా యింకెక్కడా యిల్లు అద్దెకు దొరకదన్న నిస్పృహ అతనిని ఆ మరునటిరోజు కాంట్రాక్టరుతో యీ ప్రస్తావనను యెత్తనిచ్చింది.

'ఇదిగో యిప్పుడే వెళ్ళి ఎమ్. ఎల్. ఏ. గారిని కలుసుకుంటాను. మీ గురించి ఆయనకు తెలుసు. మీలాంటి నిజాయితీపరులకు యీమాత్రం సహాయం చెయ్యలేకపోతే మాలాంటి వాళ్ళుండెందుకు?'

'ఈ మాటలు యెందుకో విశ్వనాధానికి కఠోరంగా వినిపించాయ్. ఒకరి జాలికి పాత్రమవటం నీచంగా భావించే విశ్వనాధం, తనపై తనే జాలిపడసాగాడు. ఇంతవరకూ యెవరూ కదప లేరన్నంత నిబ్బరంగావున్న విశ్వనాధం యిప్పుడు రెండుగా చీలిపోయి నట్లనిపించింది అతనికి. ఇదివరకు ప్రశ్నలెరగడు. పనులు తనకు న్యాయమని తోచినట్లు చెయ్యటంలోనే తృప్తి వచ్చేది. ఇప్పుడు తనను తానే ప్రశ్నించుకుంటున్నాడు. సరియైన సమాధానాలకోసం వెతుక్కుంటూ మనిషి మనసులో అల్లకల్లోలం జెందసాగాడు.

ఇలాంటి పరిస్థితులలో నవ్వుకుంటూ మిత్రుడు వచ్చాడు. 'ఈ వేళ మీటింగు అయ్యింది. ఆ ఒక్క మాట యెంత పని చేసిందో చూడండి. ఆ ముప్పై అయిదు యిళ్ళలో మొదటి పదిలోనే విశ్వనాధం పేరుందమ్మా. వారం రోజుల్లో డబ్బుకట్టి యింట్లో దిగడానికి ముహూర్తం పెట్టించండి.'

'నేను రికమెండేషన్ చేయించానని నీకేం తెలుసు?' 'నువ్వు చెప్పకపోయినా నాకు తెలీదా?'

'ఎవరు చెప్పారు?'

'ఊరంతా తెలిసింది. నాకు తెలిస్తే తప్పా?'

విశ్వనాధం ఒళ్ళంతా ఆ కంట్రాక్టరు కారం గుండ అంటించి నోట్లోనూ కొద్దిగా పోసినట్లుంది. కోపంతో యెగిరే వాడే. భార్య సంతోషం వుప్పులా పనిచేసి నోటికి రుచి తగిలింది.

'వెంకటేశ్వరస్వామీ, యెన్నాళ్ళకు నీ దయ కలిగింది. మా స్వంత గూట్లో గుక్కెడుగంజితాగినా... పంచభక్ష్యపరమాన్నాలు తిన్నట్టే. ఇక నిన్నింకే కోరికా కోరను తండ్రీ.'

క్రొత్త యిల్లు. ఎంచక్కా వుంది. ఈ విశ్వనాధం యెప్పుడూ యిలాంటి అందమైన అన్ని సదుపాయాలూవున్న యింట్లో వుంటానని కలలో కూడా అనుకోలేదు. రెండు పడకగదుల్లో—పైన సీలింగ్ ఫేన్లు. డ్రాయింగ్ రూము, డైనింగ్ రూము కలిసే వున్నాయ్. డైనింగ్ రూముకు ఆనుకునే వంటయిల్లూ, స్టోరుగది; డాబామీదకు పోవడానికి ఒకగదినించి మెట్లు. ఫ్లష్ఔట్‌వున్న రెండు దొడ్లు. ఇంటిలో నాలుగు కుళాయిలూ. తనకు తీరని కోర్కెల్లో ఒకటిగా మిగిలిన షవర్‌బాత్ యిక్కడ నిక్షేపంగా రోజూ పొందొచ్చు. ముందు పూలమొక్కలు వేసుకోడానికి జాగా. వరండాలో హాయిగా పదిమంది దొర్లొచ్చు. వెనకజాగాలో తనకిష్టమైన పాదులు పెట్టుకోవచ్చు. రెండు అరటిమొక్కలు బొప్పాయి సీమమిరపచెట్లూ కూడా వేసుకోవచ్చు. అదృష్టం యెప్పుడోగాని కలిసిరాదు. వస్తే యెన్నిఅడ్డున్నా అధిగమించుకుంటూవచ్చి వరిస్తుంది. అదృష్టదేవత అందమైన ఆడదిగావచ్చి కౌగలించుకుని యీ యిల్లాలుగా మారినట్లనిపించింది.

తన మాట అలా వుండనీ పిల్లల సంతోషం యింతా అంతా కాదు. ఫేను పూర్తిగా వేసుకుని పడుకుంటున్నారు. కుళాయి బాగా విప్పి తల పెట్టుకున్నారు. డాబాయెక్కి బంతిఆట ఆడుకుంటు

న్నారు. వాళ్ళ నోట పాటలు కులాసాగా వాటంతటవే వస్తున్నాయ్. వేసుకున్న గుడ్డలు మాయటం లేదు. వారం రోజులకే పిల్లల్లో యెంత మార్పు. ఈ వారంలోనే వాళ్ళు పెద్ద ఆస్తిపరుల బిడ్డల్లా మసలుతున్నారు. వీళ్లేనా యిన్నాళ్ళూ నక్కినక్కి భయంతో బిడుగులో యింట్లో ఒక గదిలో మగ్గిపోయిన తన పిల్లలు? ఇంత చలాకీ పిల్లలని తనెప్పుడూ అనుకోలేదు. ఇల్లు చూడగానే అన్ని కరువులూ తీరినట్లయ్యాయ్.

ఇల్లు చూడడానికి యెందరో వస్తున్నారు. ముచ్చట పడుతున్నారు. వాళ్ళు ముచ్చట పడుతుంటే భార్యకు మరీ గర్వంగా వుంది. అంతవరకూ విశ్వనాథం తనకు ఏ పరిస్థితులలో యిల్లు వచ్చిందన్న విషయం తలపులోనికి రాకుండా ప్రక్కకు నెట్టి వేస్తున్నాడు. ఈ యింట్లోకి వచ్చాక తన పిల్లకు ఒక సంబంధం కూడా వచ్చింది. వాళ్ళూ హెచ్చు అడిగారుగానీ అంత యివ్వలేనంటే మీ సంబంధం మా కళ్ళల్లోంచి దిగకుండా నెలరోజుల్లో మీ కేదో కబురు పెడతామని చెప్పారు.

ఒకనాడు ఒక పాత మిత్రుడు యింటికొచ్చాడు. వాడు కూడా యిలాంటి యింటికే పెట్టాడట కానీ వాడికి రాలేదు. కట్టిన వెయ్యిరూపాయలు వాపసు చేశారు. వచ్చి యిల్లుచూసి కాఫీ తాగాక యేమన్నాడంటే... 'నాకు చాలామంది చెప్పారు. గట్టి రికమెండేషన్ చెయ్యించమని. నాకో నమ్మకం వుంది. అది పిచ్చినమ్మకమే అనుకో. రికమెండేషన్లవలన వచ్చిన వుద్యోగం వూడిపోతుంది. అలా వచ్చిన యిల్లు తగలడుతుంది. అలా వచ్చిన యింట్లో ప్రశాంతంగా గడపలేం. ఈ యిళ్ళ యెలాట్‌మెంట్ విషయంలో వూళ్లో చాలా దుమారం రేగింది. వాళ్ళల్లో వాళ్లే పంచుకున్నారని, పెళ్ళాం పేరో, తలిదండ్రుల పేరో యిళ్ళున్నవాళ్ళకే వాళ్లు యిళ్ళిచ్చారనీ—ఒక ఖచ్చితమైన ప్రాతిపదిక లేకుండా—తాత్కాలికమైన వేర్వేరు అభిప్రాయాలు—అవైనా క్రోడీకరించకుండా...చిత్తం వచ్చినట్లు నిర్ణయాలు తీసుకున్నారని...చాలా అపోహలు కలిగినయ్. కానీ నీలాంటి నిజాయితీపరుడికి వచ్చిందంటే ..ఏం...నువ్వు రికమెండేషన్లకి యే పరిస్థితులలోను యెగబడవని నాకు తెలుసు—యిల్లు యివ్వటంలో న్యాయంగా వెళ్ళారని చెప్పొచ్చు.'

విశ్వనాథం యీ మాటలకు నవ్వేశాడు. అతను వెళ్ళాక ఆ నవ్వే వెకిలిగా తన హృదయంలో రేగింది. అవి మంటల్లా రాత్రి అయేసరికి విజృంభించాయ్. నిద్ర పట్టలేదు. చివరకు భయంతో నిద్రపోయాడు. ఏవో కలలు. పీడకలలు. ఈ యింట్లో దాగివున్న భూతాలేవో తనమీదపడి పీక పిసుకుతున్నట్లు—కేక లేస్తూంటే. భార్య లేపింది. 'తిన్నగా పడుకున్నారు. ప్రక్కకు పడుకోండి'. ప్రక్కకు పడుకున్నాడేగానీ నిద్దర రాలేదు.

ఆ మరునాటి రోజంతా మనసులో మరో ఆలోచనలు లేవు. రికమెండేషన్లవలన వచ్చిన యిల్లు తగలడుతుందన్న మిత్రుని మాటల్లో తనకున్న విశ్వాసం రాను రాను బలీయమౌతుంది. సాయంత్రం యింటికి వచ్చేసరికి వాతావరణం మామూలుగా వుంది. ఇంటికి వెళ్లేసరికి యెవరికైనా జ్వరమో తలనొప్పో వుంటుందనుకున్నాడు. అలాంటిదేమీ లేదు. పైగా హెచ్చు పిల్లలు కేకలేసుకుంటూ ఆడుకుంటున్నారు. కొడుకు క్రొత్తగా నాటిన క్రోటన్సుమొక్కలకు నీళ్లు పోస్తున్నాడు. ఆ రాత్రి భార్య భోజనాల దగ్గర 'పొరుగువాళ్లు పిలిస్తే వెళ్లాను. డ్రాయింగ్ రూములో మెర్క్యురీ లైటు వెయ్యించుకున్నారండీ... సోఫాసెట్ రకరకాల బొమ్మలు—మనం యేదో ఒక ఖర్చు తగ్గించుకుని యివన్నీ ఒకటి తరువాత ఒకటి కూడబెట్టుకోవాలి.'

రాను రాను తనకు మౌనమే శరణ్యమౌతోంది. నెల రోజుల్లో యింటికి వెళ్లడానికే బాధపడిపోతున్నాడు. ఈ లోగా అనుకున్న కూతురు సంబంధం తప్పిపోయింది. ఈ సంఘటనను భార్యా—భర్తలు తలోలా వ్యాఖ్యానించుకున్నారు. 'తప్పింది. అమ్మాయికి అందచందాలు లేవా? తెలివి తేటలు లేవా? డబ్బే ప్రధానం అన్నవాళ్ల యింట్లో నా కూతురు పడకపోవటం మన అదృష్టం. ఈ యింటి చలవ!'

విశ్వనాథం, యీ యింటి శని—అవుతుందనుకున్న సంబంధం కాకుండా చేసిందనుకున్నాడు. రాను రాను అతని చెవులకు మిత్రుని మాటలే యెల్లవేళలా వినిపించసాగాయ్. ఎవరో తనను 'దొంగ' అని యెత్తి పొడుస్తూనే వున్నారు. అవకాశవాదిని యేవగించుకుంటున్నారు. నడుస్తుంటే పకపకనవ్వి హేళన చేస్తున్నారు. ఇన్ని చేస్తున్నది

యిదివరకు యెన్నో కష్టాలు అనుభవించి నిజాయితీకి కట్టుబడిన విశ్వనాథం. ఇప్పటి విశ్వనాథం వేరే వాడుగా తోచింది. కడివెడు చిక్కని పాలలో యీ సంఘటన ఒక చుక్క మజ్జిగ పోసినట్లు, తెల్లని కాగితంపై సిరా ఒలికినట్లు, కుడిచేతిలో బొట్టన వ్రేలు తెగినట్లు...ఇంకెన్నో విధాలుగా తను పతన మైనట్లు విశ్వనాథానికి తోచింది. ఇంట్లో దిగిన రెండు నెలలకు ఒక సంఘటన జరిగింది.

చీకటిపడి యింటికి వచ్చేసరికి తన ఒక్క గాని కొడుకు మంచంమీద జ్వరంతో పడి వున్నాడు. సాయంత్రమే డాబామీది నించి గబగబా దిగుతూ జారిపడ్డాడు. చేతికి తలకి చిన్నగాయాలు తగిలాయి. ఎముకలు విరగలేదని ఆ దగ్గర్లో వున్న డాక్టరు చెప్పాడు.

'మనం అదృష్టవంతులం. ఆ వెంకటరమణ మూర్తి చక్రం అడ్డువేసాడు. లేదా అంటే యిల్లు యిచ్చినవాడు యిందులో అఘాయిత్యం చెయ్యిస్తాడా?'

భార్య మాటలకు విశ్వనాథం సంశయంగా చూసాడు. కొడుకు బెగిరి పోయినట్లున్నాడు. ఒళ్లు కాలిపోతోంది. ఆ రోజు వచ్చిన జ్వరం వారం రోజులైనా తగ్గలేదు. విశ్వనాథానికి రోజు రోజుకూ పెరిగిన కొడుకుపై మమకారం యీ యింట్లో ప్రతి మూలను యిటికను, కిటికీని సంశయంతో చూడనిచ్చాయ్. రాత్రుళ్లు కొడుకు దగ్గరే కూర్చునేవాడు. జీవితంలో ఒక్కసారే కోరు కున్నాడు, యిదివరకు. అది యిల్లు కాదు—కువా ర్తెలు పుడుతూవుంటే 'ఒక్కకొడుకును ప్రసాదించు తండ్రీ' అని. ఆ కొడుకు తనను పోషిస్తాడని కాదు. తన తండ్రి ప్రతిరూపం గుణంగా తన కొడుకు నిల వాలి. ఆ కొడుకు పుట్టాక కోరికలంటూ పెట్టు కోలేదు. అందుకే తను అంత విశ్వాసంగా, నిజా యితీగా బ్రతగ్గలిగాడు. తను యింటి విషయంలో కుక్క యెంగిలిఆకుకు కక్కుర్తి పడినట్లు పడ్డానని, దాని పర్యవసానంగా తనకు ప్రియాతిప్రియమైన ఒకే ప్రాణి మీద ఆ చెడుగు రుద్దబడుతున్న దని అనుకున్నాడు. వేసిన ముడి విప్పగలిగినట్లు తను చేసిన ఘోరాన్ని సరిదిద్దుకోగలనన్న విశ్వాసం తనలో జనించింది. భార్య మనసుండక పనిమనిషి చెప్పిన మాటలు విని ఒక భూతవైద్యుడ్ని రప్పిం చింది. వాడు యిల్లంతా పరికించి—

'మనిషి యెముకలు యీ పునాదుల క్రింద వున్నాయ్. వాస్తు శాస్త్రానికి విరుద్ధంగా యీ యిల్లు కట్టారు. ఇందులో ప్రాణనష్టం వుంటుంది.'

విశ్వనాథం యీ మాటలు విన్నాడు. మొదట నమ్మలేదుగానీ జ్వరం రోజురోజుకూ ముదురు తూంటే ఆ మాటలే తలలో తిరుగుతున్నాయ్. ఆ భూతవైద్యుడు కట్టే రక్షలయందు తనకు నమ్మకంలేదు. ఆలోచనలతో మనసు అల్లకల్లోలమై పోతోంది.

నడిరాత్రి భార్యాపిల్లలూ పడుకున్నారు. కొడుకు మూలుగుతున్నాడు. విశ్వనాథం కళ్లవెంబడి నీరు బొటా బొటా కారిపోతోంది. ఇంత అసహాయత తనెప్పుడూ కనీవినీ యెరుగడు. ఈ యిల్లు గొడవ రాకముందు గుప్తులనాటి యినుపస్తంభంలా తుప్పు పట్టకుండా నిల్చాడు. ఈ యింటిమీద మమకారం లోలోన చంపుకోక పోవటమే యీ అనర్థానికి దారి తీసిందన్న నమ్మకం కలిగింది. తనకి తప్పించి యీ యిల్లు అందరికీ సుఖాన్నిచ్చింది. అన్యాయంగా వచ్చిన యీ యింట్లో న్యాయం వర్ధిల్లదు; సత్యం గెలవదు. అమాయక మైన ప్రాణాలు ఆహుతైపోతాయ్. తన కుటుం బంలో తనూ భార్యా అమాయకులు కారు. పిల్లలే అమాయకులు—చల్లనివారు. వాళ్ళను తనకున్న యింటిమీది మమకారంతో కాల్చివేయటం యిష్టం లేదు. ఈ యింటినించి కదిలితేగాని తన కొడుకు దక్కడు. తన కొడుకు లేకపోతే తనే లేడు.

ఉదయమే జ్యోతిష్యుని దగ్గరకు కొడుకు జాతకంతో పరుగెత్తాడు. అతను చూసి 'స్థలం మార్చేయ్' అన్నాడు. తిరిగివస్తూ జ్వరానికి సరైన మందిచ్చే యింకో డాక్టర్నో, ఆస్పత్రిలో చేర్చే బదులు యీ నమ్మకాల్లో యెందుకు పడ్డానని అనుకున్నా ఆవేశంతో యింటికోసం వెతక నారంభించాడు. ఒక సందులో—ఈగలూ దోమలూ ముసురుతున్న ఆ సందులో, యెలక్ట్రిక్ దీపాలులేని రెండు గదుల యిల్లు దొరికింది. నీరు వీధిలోనున్న నూతినించి, కుళాయినించీ మోసుకోవాలి. చీకటిగదులు. దొడ్డి తడికలదొడ్డి. వెంటనే నెల అద్దె అడ్వాన్సు యిచ్చి తాళం తీసుకున్నాడు.

పదిగంటలకల్లా యింటి యెదురుగా లారి

విల్చింది. సామాన్లన్నీ అందులో చేర్చేసరికి గంటపై బడింది. భార్యకు యిదంతా అయోమయంగా వుంది. ఒకే ప్రశ్న వేస్తే 'నీకు యిల్లు కావాలా? కొడుకు కావాలా?' అని తిరిగి ప్రశ్న వేసాడు. మౌనంగా కొడుకుతోబాటు లారీ యెక్కింది. కొత్త యింట్లో దుర్గంధం. ఒక బాత్‌రూమ్. పిల్లలు అప్పుడే చికాకు పడుతున్నారు. రెండు రోజులు చూసాడు. జ్వరం తగ్గలేదు. పిల్లాడు రోజురోజుకు నీరస పడుతున్నాడు. రెండు రాత్రుళ్ళు నిద్రపోక ఆలోచించి ఆలోచించి ఆ మరుసటి రోజు వుదయం టౌన్ ప్లానింగ్ ట్రస్ట్ ఆఫీసుకు వెళ్ళి ఆ పెద్దను కలిసి తన వుద్దేశం చెప్పాడు.

'పోనీ యెవరికో అద్దెకివ్వండి' అన్నాడాయన.

'నాకు ఆ యింటితో సంబంధమే వద్దు. దయచేసి యీ యింటిని యింకెవరికో యివ్వండి. నేను రెండు నెలలున్నాను. ఆ రెండు నెలలకు రెండు వందలు అద్దె తీసుకుని—మిగతా డబ్బు నాకు వచ్చేటట్లు చేయండి.'

'ఎల్లుండి వుదయం పది గంటలకు రండి. మీ డబ్బు మీకు చేరేటట్లు చూస్తాను.'

విశ్వనాథం యింటికి వచ్చి తను యేంచేసిందీ భార్యకు కూడా చెప్పలేదు. ఆ వేళ సాయంత్రమయ్యేసరికి కొడుకు తనవేపు చూసి నవ్వాడు. ఆ నవ్వు చూడగానే విశ్వనాథంలో ఆలాంటి యిళ్ళు పది కట్టించుకున్నంత సంతోషం కలిగింది. ఆ మరుసటి రోజు బార్లీనీరు బాగా దిగింది.

మూడోరోజు పది గంటలకు టౌన్ ప్లానింగ్ ట్రస్టు ఆఫీసుకు వెళ్ళి ఆ యింటితో సంబంధం వదల్చుకుని వాళ్ళిచ్చిన చెక్కు తీసుకున్నాడు. ఒక పెద్ద నిట్టూర్పు విడిచి బయటకు వచ్చాడు. ముడి విడిపోయింది. ముడిలేని తాడులా సాగిపోయాడు. ఇన్నాళ్ళూ యెక్కడో అజ్ఞాతంగా దాగున్న విశ్వనాథం మళ్లీ తన గూటిలో చేరినట్లనిపించిం దతనికి. ఆహుతైపోయిందనుకున్న ఆత్మ మళ్ళీ వెలిగింది. ఆ వెలుగులో అతను మళ్ళీ గుండె విరుచుకుని నడవసాగాడు.

గబగబ యింటివేపు వచ్చేస్తున్నాడు. అదిగో నల్లకారు. ఎంబాసిడర్ కారు..ఎమ్. ఎల్. ఏ. ఇంటి దగ్గర ఆగింది. ఆ కంట్రాక్టరు దిగాడు. విశ్వనాథాన్ని అల్లంతదూరంలో చూసి, ఆగి అతను అక్కడకు రాగానే భుజంమీద చెయ్యివేసి 'రండి ఒక్క నిమిషంలో తిరిగి వచ్చేద్దాం—మిమ్మల్ని యింటి వరకూ దిగబెట్తాను.' అలా అంటూనే అతను విశ్వనాథాన్ని లోనికి తీసుకుపోయాడు.

ఎమ్. ఎల్. ఏ. గారు డ్రాయింగ్ రూములో పేపరు చూస్తున్నారు. కంట్రాక్టరు కరచాలన చేస్తూ 'మీకు యింటి విషయం చెప్పాను కదా... యీయనే విశ్వనాథంగారు' అంటూ పరిచయం చేసాడు. ఆ ప్రజాప్రతినిధి తడబడుతూ—'అన్నట్లు మరిచాను. తీరుబడిలేని పనులండి..మీ యింటి విషయం రేపైనా ఆ ట్రస్టు పెద్దను కలిసి చెప్తాను లెండి.'

విశ్వనాథం నిశ్చేష్టుడై చూస్తుంటే కంట్రాక్టరు 'అతనికి యిల్లు వచ్చింది. మీరు ఆవేళ అన్నట్లు చెప్పటంవలననే వచ్చిందనుకున్నాను.'

'అయితే..మరి నే చెప్పక్కర్లేదన్నమాట.'

విశ్వనాథం మెల్లగా నడుచుకుంటూనే యింటికి వెళ్ళిపోయాడు. పిల్లలు దోమలు, ఈగలతో కుస్తీలు పడుతూనే వున్నారు. దొడ్డినించి కంపుకొడుతూనే వుంది. కుళ్ళు కాలవ యింటిముందునుంచి ప్రవహిస్తూనేవుంది. వెల్ల యెరుగని గోడలు వెక్కిరిస్తూనే వున్నాయ్. పై పెంకుల సందుల్లోనించి సూర్యరశ్మి పడుతూనేవుంది. ఆ సందుల్లోనించి నీరు యెప్పుడో కారుతోంది.

# 1984 లో ప్రపంచ పద్ధతి: మేధావుల ఊహాపోహ

జార్జి ఆర్వెల్ ఒకనవల వ్రాశారు. దానిపేరు 1984. అందులో ఆయన 1984 నాటికి ప్రపంచం అంతా నియంతృత్వాధికారజుష్టమై ఘోరాతిఘోరంగా మారిపోతుందన్న పద్ధతిని సిద్ధము చేశారు. కాని శాస్త్రజ్ఞుల ఆలోచనలు ఊహాపోహలు అట్లాలేవు. ఆ శాస్త్రజ్ఞులలో అవిధమైన నైరాశ్య ధోరణి గోచరించడంలేదు. ముందుకాలంలోగూడా ప్రపంచం బావుంటుందనే వారు భావిస్తున్నారు. ఒకరో అరో ఇందుకు విప్రతిపత్తిని ప్రదర్శించి వుండవచ్చు. కాని ఆ ఒక్కరు, అర గూడా జార్జి ఆర్వెల్ ప్రపంచం వస్తుందన్న భయభ్రాంతిని అభివ్యక్తం చేయడంలేదు.

1964 ప్రాంతంలో 'న్యూసైంటిస్ట్' అనే బ్రిటిష్ జర్నలు '1984 లో ప్రపంచ పరిస్థితి' అన్నవిషయం ఇతివృత్తంగా వ్యాసపరంపరను ప్రకటించివుంది. ప్రపంచ ప్రసిద్ధిచెందిన విజ్ఞాన శాస్త్రవేత్తలు, ఇంజనీర్లు, సమాజతత్వవేత్తలు, ఇంకా ఇతర మేధావులను ఆ పత్రిక యీ ప్రశ్నవేసి, ఆ ప్రశ్నకు సమాధానాలుకోరింది. 'అయ్యా! 20 సంవత్సరాల ముందుచూపుతో 1984 లో ప్రపంచం ఎట్లా వుండవచ్చునని మీరు అనుకుంటున్నారో—వ్రాయండి' అంది.

ఆ సందర్భంగా వారు వ్రాసిన వ్యాసాలు ఆ తర్వాత పుస్తకంగా ప్రకటితం అయినాయి. ఆ పుస్తకం రెండుభాగాలు. రెండుభాగాలు రెండు పుస్తకాలుగా వెలువరించబడినాయి. మొదటిభాగంలో విజ్ఞానశాస్త్రము, సాంకేతికవిజ్ఞానము ఆధారంగా ముందుసంగతులను ఆలోచించిన శాస్త్రజ్ఞుల మేధావుల వ్యాసాలు సంకలితం చేయబడినాయి. రెండవభాగంలో సమాజతత్వ స్వరూప విశేషాలను గురించి వివరించిన వారి వ్యాస సంపుటి సముద్ధరింపబడింది.

ఈ వ్యాస సంపుటి మొత్తాన్ని పరిశీలిస్తే ఇకముందు ప్రపంచం ఏవిధంగా ముందుకుపోవచ్చునని వివిధ రకాల మేధావులు భావిస్తూవున్నది తెలుస్తుంది. వారు చెప్పిన విషయాలు జోశ్యాలుగా కన్పించవచ్చు. కాని వారు శాస్త్రజ్ఞులు. మేధావులు. వారి మేధావిత్వము ఇప్పుడు ప్రపంచాన్ని ఉన్నమితంగా తన ఊహాపోహలచేత తొగొంటూనేవున్నది. అట్టివారు చెప్పినమాటలు గాలిలోంచి పుట్టినవని అనలేము. వారి రచనలవలన ప్రపంచప్రగతి ముందుముందు ఎట్లావుండవచ్చునో దిఙ్మాత్రంగా తెలుస్తుంది ఆ ప్రగతికి సంబంధించిన ధోరణులు మనోనేత్ర గోచరాలు అవుతాయి. వానిలో ముఖ్యమైన ధోరణులను గ్రహించి జాన్‌డేవి రెండువ్యాసాలు వ్రాశారు. ఆ వ్యాసాల సారాంశాన్ని ఇచ్చట ఇస్తున్నాము. జాన్ డేవి విజ్ఞానశాస్త్ర రచయిత. అబ్జర్వర్ పత్రికలో పనిచేస్తూవున్నారు. ఆ పత్రికలో శాస్త్రవిషయాలను గురించి ఆయన వ్రాస్తూవుంటారు.



## 1984 లో ప్రపంచం ఎట్లా వుంటుంది ?

'న్యూ సైంటిస్టు' వ్యాసపరంపరలో శాస్త్రజ్ఞులు ఎవ్వరూ ప్రపంచ ప్రగతిని గురించి నిరాశను ప్రకటించలేదు. జాగ్రత్తతోకూడిన ఆశను ప్రదర్శించారు. ఒకరిద్దరు కొంత అనుమానాన్ని ప్రకటించి వుండవచ్చు. కాని సర్వసాధారణంగా ఈ వ్యాసాలు వ్రాసిన మేధావులు అందరిలోను ముందుముందు ప్రపంచం బావుండవచ్చుననే అర్థమే విస్పష్టమై గోచరిస్తూవుంది. అట్లాకాక హెచ్చరికలవంటి మాటలు చెప్పినవారు ఈ మేధావులలో ఇద్దరు కన్పిస్తున్నారు. వారిలో ఒకరు అబ్దుస్సలాంగారు. ఈయన ప్రొఫెసరు. పదార్థవిజ్ఞానశాస్త్రవేత్త. ఆయన తన వ్యాసంలో ఆ విజ్ఞానశాస్త్రాన్నిగూర్చి వ్రాయలేదు. ప్రపంచంలో వెనుకబడివున్న ప్రాంతాలను, దేశాలనుగురించి వ్రాశారు. ఈ ప్రాంతాలు, దేశాలు ఇప్పుడే దారిద్ర్యంలో క్రుంగిపోతున్నవి. మరో ఇరవై సంవత్సరాలలో వీనిస్థితి మరీ హీనం కావచ్చు. ఈ దారిద్ర్యానికి సంబంధిం

చిన సమస్యలు పరిష్కారం కావాలిఅంటే సమాజంలో అందుకు తగిన చైతన్యం ఉద్బుద్ధంకావాలి. అటు వంటి చైతన్యము సంభవం కాగలదన్న ఆశ ఇప్పుడు ఎక్కడా గోచరించడంలేదు. ప్రొఫెసర్ అబ్దుస్సలాం భావప్రపంచం యీ విధంగావుంది. ఆయన తమ వ్యాసంలో ఇంకా ఇట్లా వ్రాశారు: "రానున్న ఇరువది ఏళ్లలోను ఈ దళితదేశాలలో దారిద్ర్యనిర్మూలనకు గాను పెద్దఉద్యమంవంటిది నడుపబడవలసివుంది. అది దైవకార్యం అన్న ధోరణిలో కొనసాగవలసిన అవసరం గోచరిస్తున్నది. నాకు ఇక్కడ ఒక్కటే ఆశవుంది. ఇన్నిదేశాలు ప్రపంచంలో అంకించనమై వున్నాయిగదా! ఈదేశాలు అంతర్ముఖాలు కాగల్గితే ఇబ్బందిలేదు. కాని అట్లాగాక వాని ఆలోచనలు బహిర్ముఖాలై, ప్రపంచంలో అకించనత్వంలేక అదృష్టాన్ని అను భవిస్తూవున్న దేశాలమీదకు మళ్లితే ? అది భయం కరమైన విషయంగా పరిణమించగలదు. ప్రపంచంలో కొన్నిదేశాలకే సర్వసంపన్నంగా, అధికసంపన్నంగా వుండ గల అదృష్టంవుంది. అటువంటి భూమిసంపద వారికి వుంది. ఆ సంపద [వారికిచాలగామిగిలిపోగలవిధంగా కూడా వున్నది. అట్టిదేశాలపై ఆగ్రహంగా ఈదళిత దేశ అభిప్రాయసంపత్తి పరిణమించకూడదు. అందుకే ఆ దేశాలు అంతర్ముఖంకావాలి అనడం. ఆ దేశాలు బహిర్ముఖం అయితే ఏమి జరిగినా జరగవచ్చు. అవి బహిర్ముఖం కాకుండా వుండగలవన్నది ఒక్కటే నా ఆశ."

ప్రొఫెసర్ జాషువా లీడర్‌బర్గ్ మరోవిధ మైన హెచ్చరిక చేస్తున్నారు. ఈయన స్టాన్‌ఫోర్డ్ విశ్వవిద్యాలయంలో ఆచార్యులు. వీరు సమాజధర్మము, నీతిపద్ధతులు గురించి కొంత భయాన్ని ప్రదర్శిం చారు. 'బయాలజీ'లో నూతన పరిశోధనల మూలంగా సమాజధర్మంలోను, నీతిపద్ధతిలోను మార్పులు రావచ్చు నని ఆయన అభిప్రాయపడుతున్నారు. ఆయన అనేది ఇది: ముందుముందు మనుష్యుని ముఖ్యాంగాలను తీసి అతకడం తేలిక అయిపోతుంది. హృదయకోశాలను, కాలేయాలనుగూడా ఇట్లా చేయవచ్చు. అయితే ఇందుకు తగిన వివేకి అనేది తయారుకాకముందే, విడిఅంగాలు దొరికే ఎత్తు పూర్తిగా ఏర్పడకముందే ఈ పరిస్థితి—వికలాంగాలస్థానే వేరు అంగాలను, లేక ఉత్తాంగాల స్థానే వేరు అంగాలను అతికే పరిస్థితి—సంప్రాప్తమైనప్పుడు, అందువల్ల అప్పుడు అనేక రకములైన సాంఘిక, నైతిక సమస్యలు ప్రాదు ర్భావం చెందవచ్చు.

ఇదేవిధంగా వైద్యశాస్త్రంలో కూడా పెద్ద మార్పులు రాగల అవకాశం వున్నదని ప్రొఫెసర్ లీడర్‌బర్గ్ భావిస్తున్నారు. ముఖ్యంగా మనుష్యుల ఆయుర్దాయకాలం పెరుగుతుంది. మునలితనంలో ఇప్పుడు సామాన్యంగా అందరికీ సంప్రాప్తం అవు తూన్న లోపాలు తొలగబెట్టబడవచ్చు. అందువల్ల ఈ ఆయుర్దాయం వ్యవహారం ఒక సమస్య అవు తుంది. వృద్ధాప్యంలోగూడా మనుష్యుని శక్తికి సేగి రాని పద్ధతి ముందుముందు ఏర్పడుతుంది. వృద్ధాప్యం వస్తూవున్న కొద్దీ జ్ఞానేంద్రియ కర్మేంద్రియ వైకల్యం రాకుండాకూడావుండే పద్ధతులు కనిపెట్ట బడవచ్చు. ఇది జరిగితే అప్పుడు ఇప్పుడు వున్న విద్యాపద్ధతి, ఉద్యోగ విరమణపు ఏర్పాట్లు, ఇంకా అనేకము అర్థంలేనివైపోతాయి. ఇందువలన గూడా బహురకాలైన సమాజ సంబంధమైన సమస్యలు ఏర్పడవచ్చు.

ముందుముందు విజ్ఞానశాస్త్రం ఇప్పటికన్నా అధికమైన అద్భుతాలను సాధించగల్గుతుంది. పిండో త్పత్తి సమయంలో బిడ్డయొక్క 'సెక్సు'ను, బిడ్డ యొక్క మేధాసంపత్తిని నియమించగల తాహతు విజ్ఞానశాస్త్రం సంపాదన చేసిపెట్టవచ్చు. ఇది పెద్ద విషయం కాదంటారా? స్త్రీ శోణితాన్ని, పురుషుల వీర్యాన్ని దాచివుంచి, వాని సహాయంతో సంతానోత్పత్తి పద్ధతులను సిద్ధము చేయవచ్చు. ఇందువలన ఏమి జరుగుతుందీ అంటారు. ఒక తల్లి, ఒక తండ్రి శుక్రశోణితములతో వారియొక్క వంశపారంపరికి చెందిన సర్వలక్షణాలను ఎంతమంది బిడ్డలకు అయినా సంక్రమింప చేయవచ్చు. దీనివలన అభిజాత్య సంబంధ మైన సమస్యలు అనేకం ఏర్పడే ప్రమాదం వుంది.

ఇటువంటి అవకాశాలనుగురించి తానుచర్చిస్తే కొందరు 'నువ్వు రాక్షసత్వాన్నిగూర్చి చెబుతున్నావు' అంటున్నారని ప్రొఫెసర్ లీడర్‌బర్గ్ అంటున్నారు. 'నన్ను ఇట్లా అంటున్నవారి కోపానికి కారణం ఒక్కటే. నేను చెబుతున్న విషయాలు అసాధ్యమైనవని వారుకూడా అనరు. కాని ఇవి ఇప్పుడు త్వరలో జరిగేవి కావని, ఎప్పుడో అతిదూరమైన కాలంలో జరగవచ్చు

నని నేను నటించడంలేదని మీరు నన్ను ఆడిపోసుతున్నారు' అని ప్రొఫెసర్ లీడర్‌బర్గ్ చెబుతున్నారు.

ఈ పరిశోధనలవలన, నూతన విజ్ఞాన ఆవిష్కరణంవలన, రాక్షసప్రవృత్తులు పెరగాలని ఎక్కడ వున్నది? అని ప్రొఫెసర్ లీడర్‌బర్గ్ ప్రశ్న. ఇటువంటి నూత్న విషయావిష్కృతుల మూలంగా మానవీయమైన, జీవకారుణ్య విహితములైన పనులు జరగవచ్చు. వృద్ధులు వుంటారు. వారి సంరక్షణకు వీనిని ఉపయోగించవచ్చు. పిల్లలు జన్మఎత్తుతున్నారు అంటే, అంతా అవికలులై వుండటంలేదు. కొందరికి మనస్సు సరిగ్గా వుండదు. అసలు అది కుంఠితమై వుంటుంది. అటువంటి వారి చికిత్సకుకూడా యీ నూతన విజ్ఞానం ఉపయోగ పడవచ్చు. ఇట్లా ఉపయోగపడగల అవకాశం వున్నదని ప్రొఫెసర్ లీడర్‌బర్గ్ వాదం.

వర్తమాన యుగం శాస్త్రజ్ఞుల్లో చెప్పుకోదగిన వారిలో డా॥ వెర్న్‌హెర్ ఫాన్ బ్రౌన్ ఒకరు. ఆయన రాకెట్ ఇంజనీరు. అంతరిక్ష పరిశోధనను గురించి ఈ 'పరంపర'లో వ్రాశారు. వారు ఏమంటారంటే, అంతరిక్ష పరిశోధన, అన్వేషణ మూలంగా మానవ లోకంలో ఐకమత్యం ప్రబలుతుంది—అని. ఇందుకు ఆయన ఒక ఉపపత్తి నిగూఢా చరిత్రనుంచి చూపిస్తున్నారు. పూర్వం యూరోపు రాజులు 'క్రూసేడ్లు' లేక 'మతయుద్ధాలు' అనే యుద్ధాలను సాగించారు. అందువల్ల ఏమైంది? యూరోపులో రక్తపాతం జరక్కుండా ఆగిపోయింది. అక్కడ జరగవలసిన పోరాటాలు ఎక్కడో, యూరోపుకు ఎంతో దూరంగా జరిగాయి. ఇప్పుడు ఈ అంతరిక్ష పరిశోధనం అన్నది మనుష్యులలో ఐకమత్యాన్ని పోషించి, వారి శక్తులు ఈ కృషిలో వినియోగం అయ్యేట్లు చేస్తుంది. అదే లేకపోతే మానవుని ఆలోచనలు యుద్ధానికి అభిముఖంగా పోవచ్చు—డా॥ ఫాన్‌బ్రౌన్ వాదం ఇది.

ఆయన ఇంకా ఇట్లా చెబుతున్నారు. 1984 నాటికి మానవుడు కుజమండలంలో దిగవచ్చు. అది జరిగినా జరక్కపోయినా కుజమండల, శుక్రమండలాలకు అతి సమీప దేశంలో మానవుడు సంచరించగల్గుతాడు. ఈలోగా చంద్రమండలంలో పెద్ద ఖగోళదర్శనమందిరం ఏర్పాటు కావచ్చు. అప్పటికి మనుష్యులు వాహనాలు ప్రయాణీకులను పోలి వెళ్లి వస్తూ వుంటారు.

ఈ వ్యాస పరంపరలో పాల్గొన్న ఇతర రచయితలు కొందరు ఖగోళశాస్త్రాన్ని గురించి ప్రస్తావించారు. ముందు ముందు ఈ శాస్త్రంలో పరిశోధనలు భూమియొక్క వాతావరణమండలమునకు ఆవలవున్న దేశములో కొనసాగగలవు అంటున్నారు. ప్రొఫెసర్ ఫ్రెడ్ హోయల్ వున్నారంటే, ఆయన అంతరిక్ష పరిశోధనల మూలంగా ఫిజిక్సులో బ్రహ్మాండమైన విప్లవం వస్తుంది అంటున్నారు.

ప్రకృతిలోవున్న మూలకణాలను (Fundamental particles) గురించి ఇప్పటికే విజ్ఞాన శాస్త్రం ఎన్ని విషయాలనో తెలుసుకొన్నది. అదే విధంగా ఆ కణముల నడుమ పనిచేస్తూవున్న శక్తులను గురించికూడా ఎంతో తెలిసికొని వుంది. అయితే ఈ శక్తులయొక్క పరిణామంగాని, ఆ కణముల యొక్క రాశిబలములుగాని పూర్తిగా ఎరుగబడలేదు. అసలు 'ఫిజిక్సు'యొక్క పద్ధతే అట్లా వున్నదని ప్రొఫెసర్ హోయల్ అంటున్నారు. ఆ ఫిజిక్సు అంతా దీర్ఘములు, విచిత్రములు, అవిజ్ఞాతములు నైన అంకార్థులచేత నిబిడమై వున్నదని ఆయన అభిప్రాయం.

ఇందుకు కారణం ఏమై వుంటుంది? అని ప్రశ్నించుకొని, అందుకు ఆయన ఇట్లా సమాధానం చెబుతున్నారు. పదార్థవిజ్ఞాని (physicist) వున్నాడంటే అతను ప్రతిశక్తిని 'స్థానికంగా' లేక ఏకదేశంగా, వివరించవచ్చునని అనుకుంటూ వున్నాడు. కాలంమారింది. కాని వారిలో మార్పు రావడం లేదు. ఇప్పుడు లేబొరేటరీలలో ఆయా శక్తులను దర్శించగల్గుతూ వున్నాము. అవి ఎట్లా సంభవం అవుతున్నాయి. బహుశా వానికి వానికన్నఇతరమైన పరిశిష్ట విశ్వంతో సన్నికర్ష వలన అవి ఇచ్చట సంభవం అవుతూ వుండవచ్చు. ఇప్పుడు కొన్ని ద్రవ్య రాశులను మనము 'అవికలము'లుగా 'అచలము'లుగా భావించడం వుంది. అవి గూడా కాలముబట్టి అత్యంతము మంథరముగా మార్పును చెందుతూవున్నవి అయివుండవచ్చు. ఈ విధంగా ఖగోళవిజ్ఞానం 'ఫిజిక్సు'లో పెద్ద విప్లవాన్నితెచ్చిపెట్టగల సమర్థతను కల్గివున్నది. 1984 నాటికి ఇది సాధ్యము కావచ్చునని ప్రొఫెసర్ హోయల్ భావిస్తున్నారు.

మరికొందరు మేధావులు భూమిని గురించి భూమియొక్క సంపదను గురించి అధికంగా పట్టించుకొనడం అవసరమన్న అభిప్రాయాన్ని ఇచ్చట అభివ్యక్తం చేశారు. ఇచ్చట భూమిలో గనులువున్నాయి. మానె వున్నది. భూమి చుట్టూ, భూమిమీద గాలి వున్నది. వీని అన్నింటికంటెను ముఖ్యమైనది జలము. ఈ జలాన్ని గూర్చి చాలా జాగ్రత్తపడవలసి వుంది. జలసంపదను జాగ్రత్తగా సంరక్షించుకొనడము, నిర్వహించుకొనడము జరగవలసి వుంది. ఇప్పుడు జలంయొక్క వాడకం అధికం అవుతున్నది. అభివృద్ధి చెందివున్న దేశాల సంగతి సరే; అభివృద్ధి చెందుతూ వున్న దేశాలలోగూడా జలంయొక్క వాడకం పెరిగిపోతూవున్నది. ఆరోగ్యానికి, త్రాగడానికి, జీవన ప్రమాణ అభ్యున్నతికేగాక, వ్యవసాయ క్షేత్రాలకు నీటివసర్లను సమకూర్చడమునకుగూడా జలం ఇప్పుడు అధికంగా వినియోగం అవుతున్నది. ఫ్రెంచి మేధావి శ్రీ పియర్‌లాఫిట్ చెబుతూ వున్నదానినిబట్టి 1984 నాటికి ప్రపంచంలో నీటివసరుల సరఫరా ఇప్పటికన్నా రెట్టింపు కావలసివుంది. ఈ ఇంతటిజలాన్ని వినియోగంలోనికి తీసుకొని రావడానికిగాను ఒక లక్షకోట్ల (100000 కోట్ల) సొనులు పెట్టుబడి క్రింద అవసరం కావచ్చునని ఆయన అంచనావేస్తున్నారు.

కంప్యూటర్లు వాడకంలోనికి వస్తున్నాయి. రవాణాసౌకర్యాలు, వార్తా ప్రసారసౌకర్యాలుకూడా అధికాధికం అవుతున్నాయి. మనం మనకు ఇష్టమైన పత్రికను చదవాలి అనుకున్నాము; అప్పుడు అట్లా ఒకమీటను త్రిప్పితే ఆ పత్రిక మనముందుకువచ్చే ఏర్పాట్లు ముందు ముందు అమలులోనికి రాగలవని సర్‌జెరాల్డ్‌బారీ అంటున్నారు. అదేవిధంగా పుస్తకాలు: మనకు ఇష్టమైన పత్రికల, పుస్తకముల వెనుకటి ప్రతులు—అన్నీ ఈవిధంగాకోరినవెంటనే ముందుకువచ్చే సదుపాయాలు సంభవం అంటున్నారు. కంప్యూటర్లు వున్నాయికదా, అవి మనుష్యుని కాయకష్టాన్ని, మనః క్లేశాన్ని చాలవరకు తొలగించివేస్తాయి. ఎవరు ఎక్కడ సంచరిస్తున్నా, వారికి అవసరమైన వార్తలు రాడారుల మూలమున, కంప్యూటర్ల ద్వారమున, క్షణాలమీద అందేపద్ధతి వస్తుంది.

రాడారులను, కంప్యూటర్లను గుప్తంగాపెట్టి, సమాచార సేకరణం చేయడము ఇప్పుడే అమెరికాలో జరుగుతూవుంది ముఖ్యంగా పన్నులు ఎగగొట్టకుండాచూచేందుకు సాధనములుగా ఇప్పుడు అవి ఉపయోగించబడుతూ వున్నాయి. ముందు ముందు ఈ కంప్యూటర్ల రహస్య పర్యవేక్షణకు జీవితంలో బహు రంగాలు వశముకావచ్చునని డా॥ విక్క్ర్ హెచ్చరిస్తున్నారు. ఆలోచించి చూస్తే, 'ఆర్వీలియన్‌జగత్తు' ఈ సాధనములదగ్గరే సాధ్యంఅయ్యేట్లు కన్పిస్తున్నది. జార్జి ఆర్వెల్ తన నవలలో ఇటువంటి కొన్ని అద్భుతాలను చిత్రించాడు. అన్ని గృహాలలోను మరొకంటికి తెలియకుండా 'మానిటర్లు' అన్న సాధనవిశేషాలను అమర్చివుంచడమువలన వైయక్తిక జీవనం అన్నది, గోప్యజీవనం అన్నది ఆ ఆర్వీలియన్‌జగత్తులో లేకుండాపోతుంది. ఇటువంటి విషయాలను కొన్నింటిని వదిలివేస్తే 1984 నాటికి ప్రపంచం అనేక రంగాలలో ఎంతోముందునకు పోగల అవకాశాలువున్నాయి. అంతా 'రెక్క'యే అయిన విమానాన్ని 1984 నాటికి సృష్టిచేయవచ్చునని డా॥ ఎం. జె. రైట్‌హిల్ భావిస్తున్నారు. నెమ్మదిగా పోవాలన్నా, లేక అతివేగంతో పోవాలన్నా ఆ విమానమే అన్నింటికి సమర్థం అయివుంటుంది. ఇప్పుడు ఈ రెండు ప్రయోజనాలను సాధించడానికి 'రెక్కలల్లార్చే' విమానాలను తయారుచేయాలని చూస్తున్నారు. 1984 నాటికి అది మాలావడి 'పక్షైకవిమానాలు' తయారు అవుతాయట;

ఇప్పుడు రచయితలకు, శాస్త్రజ్ఞులకుగూడా మూడు ముఖ్యవిషయాలను గురించి ఏకవాక్యత కన్పిస్తున్నది. వానిలో ఒకటి, అణ్వస్త్రయుద్ధం సమస్యకు సంబంధించినట్టిది; రెండవది జనాభా విస్తరణకు సంబంధించినట్టిది; మూడవది విద్యకు సంబంధించినట్టిది.

అణ్వస్త్ర యుద్ధము విషయములో రచయితలు, శాస్త్రజ్ఞులు అయిన మేధావుల అభిప్రాయము ఇట్లావుంది. ఇప్పటికి, 1984 కు మధ్యనడిచే నడిమి కాలములో ఈరకమైన యుద్ధము రాదు. వచ్చినా పెద్దఎత్తునసాగదు. ఒకవేళ పెద్దఎత్తునసాగితే, అప్పుడు యోచించవలసినదే లేదు; యోచించగలిగిందీ లేదు. ఎందుచేతనంటే, ఆ రకమైన యుద్ధమే అంటూ జరిగితే, అక్కడ ఏమీ మిగలదు. అందువల్ల అసలు ఆ రకమైన యుద్ధమే అటుప్లం కాకపోవచ్చునని దాదాపుగా మేధావులంతా భావిస్తూవున్నారు.

ఇక రెండో సమస్యవున్నది: జనాభా సమస్య. ఇప్పుడు దీనినిగూర్చి ఎక్కువ ఆలోచన జరుగుతూ వుంది. 1984 వచ్చేసరికి ప్రపంచం జనాభా ఇప్పటికి కన్నా 100 కి 50 లేక 60 వంతులు పెరగవచ్చునని వీరంతా భావిస్తూవున్నారు. మనుష్యుని ఆయుర్దాయ ప్రమాణంగూడా ఇప్పటికన్నా అధికంగా వుంటుందని వీరి అందరియొక్క అంచనాయు అయివుంది. అప్పుడు ఈ జనాభాకు భోజనం ఎట్లా ? ఇది ఇంకోసమస్య అయి కూర్చుంటున్నది.

ఇవిగాక మరికొన్ని రాగల సమస్యలను గూర్చి కూడా మేధావులు యోచిస్తూవున్నారు. జోశ్యాలు చెబుతూవున్నారు. జనాభా పెరిగిపోతుంది. కాబట్టి పట్టణాలు, నగరాలు అధికం అయిపోతాయి. ఆ రాగల పట్టణాలముందు ఇప్పటి లండను, ఇప్పటి టోకియో, ఇప్పటి న్యూయార్కు వట్టి దిష్టి పట్టణాలక్రింద కనిపిస్తాయి. కలకత్తా వున్నదంటే, అది ఇప్పటికన్నా ఎంతో పెరిగిపోతుంది. ఆ నగరం జనాభా 4 కోట్లు దాటుతుంది. ఇట్లా పెరిగిపోయే పట్టణాలను సరిగా అభివృద్ధి పరచడము, పునర్నిర్మించడము కష్టం గనుక, పాతపట్టణాలకు కొత్తపట్టణాలకు, ఒకే పట్టణంలో పాతభాగానికి కొత్తభాగానికి మధ్య అనంతమైన అంతరం కనిపిస్తూవుంటుంది. సమాజసంబంధమైన అశాంతి పెరిగిపోతూ వుంటుంది. '1984లో పట్టణాలలోను, పట్టణాలచుట్టునుగూడా బ్రహ్మాండమైన అశాంతి, అల్లరి అలుముకుపోయి వుంటాయి' అని శ్రీమతి గ్లాస్ అన్న మేధావి అంటున్నారు.

మూడవది విద్యకు సంబంధించిన సమస్య. ఈసమస్య అనేకమైన విచిత్రపరిణామాలకు దారి తీస్తుందని మేధావులు భావిస్తున్నారు. సమితి విద్యా సాంస్కృతికసంస్థ డైరక్టరు జనరలు శ్రీ రీన్ మాహ్యూవున్నారు. ఆయన ఏమంటారంటే, 1984 నాటికి చదువురాని పిల్లగాని, పిల్లడుగాని వుండరు—అని. నాల్గు సంవత్సరాలు చదివినా, ఆరుసంవత్సరాలు చదివినా, మొత్తంమీద అందరూ విద్యావంతులవుతారు. అవిద్య అనేది గతకాలపు విషయం అయిపోతుంది. ముసలివాళ్లలో మాత్రమే విద్యలేనివాళ్లు వుంటారు. అయితే ఇప్పుడు అభివృద్ధిచెందివున్న దేశాలలోకూడా విద్య అన్నది అనంతంగా పెరిగిపోతూవుంటుంది గనుక, ధనిక, నిర్ధనిక దేశాలమధ్య విద్యారంగంలో భేదా ఇప్పుడువున్నట్లే వుండవచ్చు. ఇదికూడా శ్రీ మాహ్యూ అభిప్రాయం.

యంత్రీకరణము, సమాజంలోవచ్చే మార్పులు, సాంకేతికవిజ్ఞానాభివృద్ధి—వీని అన్నింటి మూలంగాను విద్యఅన్నది ఏదో కొంతకాలం నేర్చి తర్వాతవూరుకునేదిగా గాక, జీవితకాలము నేర్వవలసింది అయిపోతుంది. బ్రిటిష్‌మంత్రి లార్డ్ బాడెన్ చెప్పిన దాన్నిబట్టి వయోజనవిద్యావంతులకు పునర్విద్యాకార్యక్రమాలు అవసరం అవుతాయి. ఆ కార్యక్రమాల కోసం పెద్ద పెద్ద మొత్తాలను ఖర్చు పెట్టవలసి వుంటుంది. 1984 నాటికి ఒక్క బ్రిటన్‌లోనే తగిన విద్య, తగిన నేర్పు లేని కారణంచేత 20 లక్షల మంది దాకా నిరుద్యోగులై వుండవలసి వుంటుందని ఆయన అంచనా వేశారు.

ఇట్లా ఏర్పడే విద్యా సంబంధమైన సమస్యలను గనుక సవ్యంగా పరిష్కరించగల్గితే, అప్పుడు 'ఆటోమేషను' లేక సార్వత్రికయంత్రీకరణమువలన పొందగల అన్ని లాభాలను పొందడానికి అనుభవించడానికి మానవలోకానికి ఆస్కారం ఏర్పడుతుంది. అటువంటి ఆస్కారం ఏర్పడితే, అప్పుడు జనానికి విశ్రాంతి అధికమై లభిస్తుంది. విశ్రాంతియొక్క అవసరాలు వేరుగా వుంటాయి. ఇటువంటి విషయాలను గురించి కూడా ఇప్పుడు కొందరు మేధావులు ఆలోచిస్తున్నారు. వారిలో జోన్ లిటిల్‌వుడ్ అనే ఆవిడ ఒకరు. ఈమె లండన్‌లోని 'థియేటర్ వర్క్‌షాపు' లో ఆర్టు డైరెక్టరు.' 1984 లో జనానికి విశ్రాంతికాలంలో వలయు 'ఉత్సాహశాలల'ను గురించి తాము ఆలోచిస్తున్నట్లు ఆమె చెబుతున్నారు. ఆమె ఇప్పుడు ఒక మందిరాన్ని నిర్వహిస్తున్నారు. దానికి 'లేబొరేటరీ ఆఫ్ ఫన్' అని పేరు. 1984 లో ఇటువంటి మందిరాలలో సంగీత రంగము, నాట్య రంగము, చిత్రకళా రంగము—ఇట్లా బహురంగాలు వుంటాయి. వానిలో జనం తమ విశ్రాంతి సమయాలలో కాలక్షేపం చేస్తూ వుంటారు.

సర్ హెర్బర్టు రీడ్ వంటి మేధావులు ఈ రకమైన పద్ధతులు పనికిరావంటున్నారు. ఇవి అన్నీ 'రెడీమేడ్' కాలక్షేపాలని, వీనివలన నిజమైన కళ, శిల్పము చచ్చిపోయి, జీవితం మోడులాగా

తయారు అవుతుందని వాదిస్తున్నారు. వీరి దృష్టిలో ఆ 'విశ్రాంతి' ఒక సదవకాశము, ఒక సుఖముకాక, ఒక చిక్కు సమస్య క్రింద తయారై పోవచ్చునన్న ప్రతీతి ఏర్పడుతున్నది.

సర్ హెర్బర్ట్ చెబుతున్న మాటల సారాంశం ఇట్లా వుంది : జూదం జాతీయం అయిపోతుంది. ప్రభుత్వాలకు అది పెద్ద ఆదాయ మార్గం అవుతుంది. పుస్తకాలు, కవిత్వాలు పూర్తిగా అంతరించి పోతాయి. రచయిత అన్నవాడు ఎవడన్నా ఆ 1984 నాటికి వుంటే, వాడు టెలివిజన్ స్క్రిప్టు రైటరు అయివుంటాడు. 'ప్రపంచం అంతటా దీపాలు వెలిగిపోతూ వుంటాయి. ఆ దీపం వెలగనిచోట ఒక్కటే వుంటుంది. అది మనుష్యుని హృదయం.'

విజ్ఞానశాస్త్రాలలో సైకాలజీ, ఫిజియాలజీ బాగా అభివృద్ధి చెందుతాయని, మహావ్యాధులకు ఉత్తమ చికిత్సలు సంభవం కాగలవని వార్డ్ బ్రయన్ భావిస్తున్నారు. ఈ అభివృద్ధితో పాటు కొత్తరకాలయిన 'డ్రగ్గులు' లేక 'విష ఔషధాలు' పెరిగిపోతాయి. జనం వాటికి బాగా అలవాటు పడిపోతూ వుంటారు. 1984 కు ముందే ఇది ఒక పెద్ద సమస్య అయిపోతుంది, అని ఆయన అంటారు.

వైద్యశాస్త్రంలో రెండు ప్రధాన వ్యాధులను 1984 నాటికి డాక్టర్లు జయించవచ్చునన్నది సర్ ఛార్లెస్ డాడ్స్ అభిప్రాయం అయివుంది. ఆ వ్యాధులలో ఒకటి, కాన్సరు, పుట్టకురుపు. రెండవది గుండె జబ్బు. 1984 కు ముందే ఈ రోగాలు జయింపబడవచ్చు. అప్పటినుంచి 'వృద్ధాప్య విరోధాన్ని' గురించిన పరిశోధనలు అధికం అవుతాయి. శరీరం జరాధర్మం కల్గింది. దానికి ముసలితనం రాకుండా డాక్టర్లు చేయలేకపోవచ్చు. కాని మనుష్యుని తక్కిన శక్తులకు ముసలితనం వాటిల్లకుండా చేయడం ఎట్లా అన్న ఆలోచనలు సాగవచ్చు; అవి సాగుతాయి. ఇచ్చట మానవుడు కొంత ముందుకు పోను కూడా వచ్చు; సాధించ దలచుకున్నదానిని సాధించనూవచ్చు. ఇప్పుడు అస్పత్రులలో కొన్ని దేశాలలో 'జెరియాట్రిక్ వార్డ్స్' అని వుంటున్నాయి. ముసలితనము, ఆ ముసలితనమువల్ల వచ్చే వ్యాధులు—వీటికి అచ్చట చికిత్స జరుగుతూ వుంటుంది. ఆ వార్డులలో చేరే వారి సంగతిఇప్పుడు దయనీయంగావుంటున్నది. 1984 నాటికి జరిగే వైద్యపరిశోధనల మూలంగా యీరకం సమస్యలు కొంతవరకు పరిష్కారం కావచ్చునని సర్ ఛార్లెస్ డాడ్స్ భావిస్తున్నారు.

1984 లో మనుష్యులకు భోగవస్తువులలో ప్రశస్తమైనవి ఏమిగా వుంటాయి. అంటే, ఊటల నుంచి వచ్చిన చల్లటి మంచినీళ్ళు, రసాయన సంబంధంగా సోకే జాడ్యాలు తగలని పశువుల పాలు, తీరప్రాంతానికి దూరంగా ఎక్కడో ఆ నడి సముద్రాల మధ్యంలో పట్టిన చేపలు—ఇవే ప్రధాన భోగాలవుతాయి. వీనిలో పాలపశువులను ఎవరికివారే రసాయనజాడ్యాలు తగలకుండా పెంచుకోవలసివుంటుంది. ఇవే ముందు ముందు ఉన్నతభోగాలు' అంటున్నారు సర్ ఛార్లెస్ డాడ్స్.

ప్రొఫెసర్ త్రింగ్ చెప్పేమాటలు కొంచెం మనస్సుకు ఊరటకల్గించ గలవిగా వుంటున్నాయి. ఈయన లండన్‌లో క్వీన్‌మేరీ కళాశాలలో పనిచేస్తున్నారు. ఆయనచెప్పే జోశ్యం ఎట్లాంటిది అంటే 1984 నాటికి యంత్రపు మనుష్యులు (రాబట్‌లు) అధికమై, వారే ఇళ్ళలో అన్నిపనులు చేసుకుపోతూ వుంటారు. ఆడవాళ్ళకు చాకిరీబాధ చాలావరకు తప్పిపోతుంది. 10 లక్షల పౌనులు పెట్టుబడితో 10 సంవత్సరాలపాటు నిరంతరమైన పరిశోధన, కృషీ సాగిస్తే, అప్పుడు ఇంట్లో అన్నిపనులు చూచుకోగల మరమనిషిని సృష్టించవచ్చునన్నది ప్రొఫెసర్ త్రింగ్ అభిప్రాయంగావుంది.

డా॥ మైకేల్‌యంగ్ జోశ్యం ఫలించాలి అంటే, ప్రొఫెసర్ త్రింగ్ జోశ్యం యదార్థం కావలసి వుంటుంది. 1984 నాటికి కుటుంబజీవనం ఇప్పటికన్నా ఎంతో మారిపోతుంది. వృద్ధులను ఇప్పటిలాగా బయటికి తోలకుండా బిడ్డలు వారిని ఇంట్లోనే పెట్టుకు పోషిస్తూవుంటారు. వారిని ఆదరంతో, ప్రేమతో చూస్తూవుంటారు. డా॥ యంగ్ ఇంకా ఇట్లాకూడా అంటున్నారు : "చుట్టూ ప్రపంచంలో క్లిష్టత, అనాత్మస్థితి పెరిగిపోతూవున్నకొద్దీ, ఇల్లు సుఖమైనదిగా, ఆత్మతృప్తమైనదిగా సుఖసంతోషాలకు ఆలవాలం అయినదిగా వుంటుంది." అప్పుడు

ప్రొఫెసర్ త్రింగ్ జోశ్యం ఫలిస్తే, గృహంలో సుఖం సంగతి ఇంక చెప్పనే అక్కరలేదు. స్వర్గమా! స్వర్గ సుఖ సహోదరమో!!

ప్రభుత్వాల సంగతి వుంది. ఆ ప్రభుత్వాలు అధికాధికంగా 'కంప్యూటర్ల' మీద, ప్రత్యేక ప్రత్యేకమైన నేర్పరితనాలుగల నిపుణులమీద ఆధారపడవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. వెనకవుండి అన్నిపనులుచేస్తూ వుండేవారి అధికార ప్రాబల్యాలు అధికం అవుతూవుంటాయి. ఇవి ససెక్సు విశ్వవిద్యాలయంలో ప్రొఫెసరుగా వుంటున్న శ్రీ ఆస బ్రిగ్స్ అభిప్రాయాలు. ఆర్థిక, జీవనవు పద్ధతులలో, సైనికశక్తి పరిస్థితులలోరాగల పరిణామాల వలన జాతీయరాజకీయాలకు, జాతీయ విధానాలకు స్థిరలేక, ప్రపంచంలోని సర్వదేశాలున్నూ యదార్థ పరిస్థితులకు తలఒగ్గి పనిచేస్తూ వుండవలసిన అవసరం ఏర్పడిపోతుంది. ఇక్కడ యదార్థపరిస్థితులకు శరణాగతేగాని వేరుమార్గం లేదు అంటారు ప్రొఫెసర్ బ్రిగ్స్.

ముందు ముందు ఎలక్ట్రానిక్ ప్రక్రియా విశేషాలు ఎట్లా అభివృద్ధి చెందగలవు అన్నవిషయాన్ని డా॥ వి. కె జ్వోరికిన్ చర్చించారు. వీరు అమెరికాలోని ఆర్. సి. ఏ. 'లేబొరేటరీ'లలో పనిచేస్తూ వున్నారు. ముందుముందు ఎలక్ట్రానిక్ పరికర రంగంలో రాగల విప్లవంమూలంగా ప్రజాస్వామ్యధర్మప్రక్రియలలో ఎన్నోమార్పులు వస్తాయి అని ఆయన అంటారు. ప్రజాస్వామ్యంలో ఓటింగు చాలాప్రధానమైన సంగతి. 1984 నాటికి 'టెలిఫోన్'ల మీదనే ఓటింగు జరిగిపోతుందని, నిమిషంమీద జనవాక్య సేకరణం జరుపవచ్చునని డా॥ జ్వోరికిన్ సిద్ధాంతం. మరి ఈ ఓట్లను లెక్కించేది ఎట్లా? ఫలితాలు తెలిపేది ఎట్లా? అందుకు ఒక్కటే సమాధానం. ఆరకం పనులను అన్నింటిని కంప్యూటర్లు చేస్తాయి. ఈ పద్ధతివస్తే ప్రభుత్వము ప్రజలతో ప్రత్యక్షమైన సంబంధం పెట్టుకొని, అన్ని ముఖ్యమైన సమస్యలను గురించిన్ని వారి అభిప్రాయాలుఏమో తెలుసుకొనగల్గుతూ వుంటుంది.

ఇట్లా అనేక విషయాలలో ఈ వ్యాస పరంపరలో పాల్గొన్న ఈ మేధావులమధ్య బహుముఖ్య విషయాలపై ఏకవాక్యతా, సంవాదము కన్పిస్తూవుంది. ప్రధానంగా వైద్యంలో, సాంకేతిక విజ్ఞానంలోను అనిదంపూర్వమైన పరిశోధనలు కొనసాగగలవని అనిదంపూర్వమైన రహస్యములు ఆవిష్కరింపబడగలవని వీరు ఏకకంఠంగా చెబుతూవున్నారు. జనసంఖ్యలో పెరుగుదలవలన ఏర్పడగల సమస్యలు వివిధంగాను వుంటాయి; భయంకరంగాను వుండగలవు. ఆసమస్యలు మానవునియొక్క సర్వమైన శక్తిసామర్థ్యాలనుపట్టి చూస్తాయి. మానవలోకం ఆ సమస్యలను ఎట్లా పరిష్కరించుకొనగలదు; ఏవిధము ఆ సమస్యల వలన ఏర్పడిన పరిస్థితులకు అనుకూలముగా మానవలోకం మారగలదు; మారి నిబ్బరించుకొనగలదు? — అప్పుటనే మానవునియొక్క సమస్తమైన ప్రతిభ, ఇంగితము, ఊహాపోహలు పుష్పించవలయు నవసరమున్నది. అదే ముందు ముందు మానవుడు ఎదుర్కొననున్న పరీక్ష.

మానవుడు తన ఉపజ్ఞచేత, బహువిధములైన పరిశోధనములచేత, ఎన్నో నూతన రహస్యములను ఆవిష్కరించగల్గుతూ వున్నాడు. ముందుకూడా ఆవిష్కరించగలడు. అనంతము, అఖండము అయిన యీ సర్వమైన విజ్ఞానాన్ని మానలోకం అర్థము చేసుకొనగలదా? దానియందలి పరమార్థమును జీర్ణించుకొనగలదా! ఆ సర్వమైన పరిశ్రమయొక్క ఫలితాలను సర్వమానవలోకంయొక్క కళ్యాణంకోసం సమాజం వినియోగించకలిగిన శక్తికలది అవుతుందా? ఈరకమైన ప్రశ్నములు వచ్చినప్పుడు శాస్త్రజ్ఞులలో శాస్త్రజ్ఞులకు ఏకాభిప్రాయము కుదరటంలేదు. ముఖ్యముగా సమాజధర్మవేత్తలు, ఆర్థికశాస్త్రవేత్తలు ఆందోళనమును చెందుతూవున్నారు. మానవుడు గాడిచెడి ఊడని బారుతూ వున్నట్లు భావిస్తూ వున్నారు. 1984 నాటికి ప్రపంచం ఎంతో మారిపోతుంది. ఆ పరిస్థితులకు అనుకూలమైన పద్ధతిలో మానవుడు తన పట్టణములను సర్దుకొని రాలేదు; తన వ్యవసాయమును దిద్దుకొని రాలేదు; గత సమాజధర్మ సమాక్రాంతములైన అలవాటులను మార్చుకొనలేదు. మార్చుకొన్నను మార్పులయొక్క వేగముతో సమానమైన త్వర మానవునిలో ప్రకోపనము చెందక

పోవచ్చును. ఇవి సమాజధర్మవేత్తలయు, ఆర్థికధర్మవేత్తలయు అభిప్రాయములు. ఇట్టి పరిస్థితియే సంభవించినచో, అప్పుడు దురంతమైన అశాంతి ప్రకోపనను చెందగలదని వీరు భావిస్తూ వున్నారు.

ఇంతమంది మేధావులును ఒక్క విషయమును గూర్చి ఖచ్చితంగా చెబుతూవున్నారు. అది ఇది. అణ్వస్త్రములతోడి యుద్ధము రాదు. అట్టి యుద్ధము వస్తుందని ఈ మేధావులెవ్వరూ భావించడములేదు. మరియు జార్జి ఆర్వెల్ తన 1984 లో సృష్టించిన దురధికారనియంతృత్వపునరకకూపం సంభవం అవుతుందనికూడా యీ మేధావులలో ఒక్కరుకూడా ఊహచేయడములేదు. వీరందరును ఆయాశాస్త్రములయందు, ఆయావిద్యలయందు ప్రభువులు. ముందు ముందు రానున్న ప్రపంచమునుగూర్చి వారి దర్శనము ఇట్లావుంది. వారు ప్రపంచం ఎదుర్కొంటూవున్న, ఎదుర్కొననున్న కఠోరసమస్యలు తెలియనివారుకారు. సామాన్యజనమునికన్న, మరియుతెలియునుఅని అనుకొనెడివారికన్న యీ యన్నివిషయములు అధికముగా తెలిసినవారు. వారు ఇట్లా ముందుసంగతులనుగూర్చి ఊహబలముచేత, ప్రతిభ శక్తిచేత చెప్పగల్గడమునందే, భవిష్యల్లోకష్టతరుణోపాయముకూడా ఇమిడివుంది. అదే మానవలోకమునకు బలము: అంటే: ఆశ.

— జాన్ దేవి.



# దేవుడి స్వప్నం

శ్రీ పి. కుమారస్వామి

దూరంగా వూర్మిశయ్యమీద
నిద్రజోగే యెఱ్ఱని జగచ్ఛక్షువును
మంద వీచికలు జోకొడుతున్నాయి,
మసక మేఘాల ముసుగులోకి
కోరికల గువ్వలు బారులుగా తరలిపోతున్నాయి,
పక్కగా పూలచెండ్లా, పరిమళాలు
నాజూకుగా నడిచిపోతున్నాయి.

ఇక్కడ, యీ సముద్రాంచలాన నిలచి
ఆవలి వొడ్డు సమీపిస్తుందేమోనని
వి శ్వానంతత్వంలో నిరవశేషంగా కరిగిపోయి
విస్ఫూలమైన ఆశతో నిరీక్షిస్తున్నాను:

మొన్నటివరకూ—తనూ, నేనూ
నేలమీద నిలువలేని శరీరాలతో
మబ్బుచాటుకు పోయే మసకగువ్వల్ని చూపించుకుంటూ
ఇద్దరం—ఒకరి కొకరమై
మా వేసిన అడుగుజాడలు చెరిగిపోతూ, మళ్ళాపుడుతూవుంటే
కాళ్ళకు కెరటాలు చిరుచలిగిలిగింతలు పెడుతూవుంటే
బిందు రూపాలతో
ఆనంద సరిత్కేంద్రానికి యెగసి పోయింది:
గడిచిన యుగాలు విడిచిపెట్టిన
ఈ యిసుక గుట్టలమీద కానే కాదు!

ఇప్పుడు తనులేదు:
మెలకువ వుక్కుతెరవాల్చి

దేవుడు కన్న పువ్వుల కలలోకి
ఒక్కతీ వెళ్లిపోయింది

అయినా
పూర్తిగా వెలిసిపోని రంగు చొక్కా తొడుక్కొని
చిల్లుపడిన మస్తిష్కమధుపాత్రలో
కొత్త ఆశలు పోసి, నింపి
వచ్చి చూస్తూ వుంటాను,
'దేవుడు మేల్కొన్నాడేమోనని!'

---



# విశ్వరహస్యాన్ని గురించి కొత్త సిద్ధాంతం

విశ్వమును, దాని జన్మయొక్క రహస్యాలనుగురించి మరో కొత్త సిద్ధాంతం ప్రతిపాదించబడింది. దీనిని ప్రతిపాదించిన శాస్త్రవేత్త వీజేక్కర్. ఈయన జర్మను. పూర్తిపేరు కారల్ ఫ్రెడరిక్ ఫాన్ వీజేక్కర్. చదువుకున్నది భౌతిక విజ్ఞానశాస్త్రం అయినా, హాంబర్గ్ విశ్వవిద్యాలయంలో ఈయన తత్వశాస్త్రం బోధిస్తూ వుంటారు. అందుచేత ఇప్పుడు ఈ కొత్త సిద్ధాంతంలో ఆయన ఇటు విజ్ఞానశాస్త్రాన్ని, అటు తాత్విక విజ్ఞానాన్ని సమన్వయం చేయడానికి గట్టి ప్రయత్నం చేశారు. అందువల్లనే ఆయన ఇప్పుడు బయలుదేరతీసిన సిద్ధాంతం పూర్తిగా భౌతికవిజ్ఞానశాస్త్రంగానూలేదు; పూర్తిగా తాత్త్వికవిజ్ఞానంగానూ లేదు. రెండింటికి వారధి కట్టినట్లు వుంది.

మరి భౌతిక విజ్ఞానశాస్త్రంలో ప్రొఫెసర్ వీజేక్కర్ ఏమన్నా తక్కువవాడా? బేతేతోకలిసి 'న్యూక్లియర్ ఫిజిక్సులో' 'కార్బన్ సైకిల్' సిద్ధాంతాన్ని ప్రవేశపెట్టారు. మరి కార్బన్ సైకిల్ అంటే ఏమిటి? ఇది 'ఆస్ట్రోఫిజిక్సు' అనే విజ్ఞానశాస్త్ర విభాగంలోని మాట. అనగా నక్షత్రాలు, గ్రహాలు మొదలైనవానిలో జరిగే భౌతిక వికారాలకు సంబంధించిన వ్యవహారంలో సంగతి అన్నమాట. ఈమాటకు, లేక సిద్ధాంతానికి అర్థం ఇది. నక్షత్రాలలో అణుశక్తి సంబంధమైన మార్పులు, పరివర్తనాలు సంభవిస్తూ వుంటాయి. ఇవి ఒక క్రమంలో జరుగుతూవుంటాయి. అంటే చక్రక్రమంలో నన్నమాట. ఆ జరిగినప్పుడు ఏమిజరుగుతుందంటే, ఆ నక్షత్రాలలో విడుదల అయిన అణుశక్తి వానిలో సంభవించే మార్పు లేక పరివర్తనము, లేక రూపాంతరస్థితుల మూలంగా అందులోవున్న హైడ్రోజన్ లేక ఉదజని కాస్త హీలియంగా మారుతూవుంటుంది. మరి హీలియం అంటే ఏమిటి? ఇది ఒక వాయుద్రవ్యం. దానికి రంగుగాని, వాసనగాని వుండదు. సూర్యునియొక్క వాతావరణ ఆవరణంలో ఇది వున్నట్లు శాస్త్రజ్ఞులు అనుమాన ప్రమాణంచేత నిర్ణయించారు. ఈ నిర్ణయం 1868లో జరిగింది. "1895 నాటికి ఆరకమైన వాయుద్రవ్యం అంటూ వున్నదని రూఢం చేయడం, నిరూపించడంకూడా జరిగింది. ఇప్పుడు ఇది అంతా న్యూక్లియర్ ఫిజిక్సులో అంతర్భాగం అయిపోయింది. అదేవిధంగా బేతే, వీజేక్కర్ల యీ సిద్ధాంతం— కార్బన్ సైకిల్స్ సిద్ధాంతం— కూడా అందులో అంశం అయిపోయింది.

ప్రొఫెసర్ వీజేక్కర్ ఇంకో అందుకు కూడా గొప్పవాడు. గ్రహాలు వున్నాయిగదా! ఇవి ఎట్లా ఉద్భవం చెందాయి అన్న సమస్య వుంది. ఈ విషయానికి సంబంధించి ప్రొఫెసర్ వీజేక్కర్ ఒక్క కొత్త సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు. దీనిని ఇప్పుడు విజ్ఞానశాస్త్రం 'టర్బ్యులెన్సు' సిద్ధాంతం అని అంటున్నారు. ఇది ఆటూ, పోటూ సిద్ధాంతం వంటిది. ఇప్పట గ్రహగతి సమస్థితి కల్గివుండదు. సముద్రానికి ఆటువచ్చినట్లు, పోటువచ్చినట్లు వుంటుంది. గాలి ఒకసారి అదిరికొట్టడము, ఒకసారి స్తంభించిపోవడము లాగా వుంటుంది. అయితే ప్రొఫెసర్ వీజేక్కర్ యీ తమ 'టర్బ్యులెన్సు' సిద్ధాంతంలో ఈ పైన చెప్పిన పద్ధతి 'టర్బ్యులెన్సు'ను లేక ఆటును, పోటును, 'ఫ్రిక్షన్'ను లేక ఒరిపిడిని మాత్రమే గాక గురుత్వాకర్షణాన్నిగూడా జోడించారు. ఆయన ప్రతిపాదించిన ఈ సిద్ధాంతంలోవున్న గొప్పవిశేషమే ఇది అంటారు ఇతర శాస్త్రజ్ఞులు.

ఇన్ని కారణాలచేత విజ్ఞానశాస్త్ర ప్రపంచానికి ప్రొఫెసర్ వీజేక్కర్ పేరు క్రొత్తదికాదు. పైగా ఆ శాస్త్రరంగంలో అత్యంతము ప్రసిద్ధమైంది. అందువల్ల విశ్వరహస్యాన్ని గురించి విశ్వంయొక్క సృష్టి లేక ఉద్భవము, అందులో భాగాలు, దాని స్వరూపం, దాని ధర్మాలు—ఈ మొదలైన వానిలో

అంతగా చొరవలేని శాస్త్రవేత్తల్లో కూడా ఇప్పుడు ఆయన ప్రతిపాదిస్తున్న ఈ నూతన విశ్వరహస్య సిద్ధాంతంపట్ల ఆసక్తి అధికం అవుతూవుంది. ఇందుకు కొంతకారణం కూడావుంది. పూర్వం పీజెక్ బర్గ్ ఏవిధంగా భౌతికవిజ్ఞానంలో ఐకమత్యం లేక ఏక వాక్యతకోసం కృషిచేశారో, అదే విధంగా ఇప్పుడు ప్రొఫెసర్ వీజెక్కర్ కూడా అందుకే కృషిచేస్తున్నారు. యూనివర్సల్ క్వాంటమ్— సిద్ధాంతం, 'ఎలిమెంటరీ పార్టికల్ సిద్ధాంతాలు,' విశ్వనిర్మాణ రహస్యాలకు సంబంధించి సిద్ధాంతాలను సమన్వయంచేసి, వాని మధ్య అవిరోధం ఏర్పడేట్లు చేయాలన్నదే ఇక్కడ ప్రొఫెసర్ వీజెక్కర్ ప్రయత్నం. 'క్వాంటం' సిద్ధాంతం వున్నదంటే అది తేజోభూతానికి సంబంధించిన విషయం. ఈ తేజో భూత సంబంధమైన క్రియాకలాపాలు, ముఖ్యంగా మాలెక్యూలులలోను, అణువులలోను తేజస్సంబంధంగా జరిగే మార్పులు, అనగా వానియందలి తేజోధాతు వికారాలు ఏకాకారంగా జరగవు. అనుస్యూత ప్రక్రియను జరగవు. అచ్చట ఆ వికారాదికంలో సాంతత్యం లేదు. ఆ తేజోధాతువు ప్రత్యేక ప్రత్యేక పరిమాణ విశేషం కల భాగాలుగా ఆ వికారాన్ని చెందుతూవుంటుంది. ఆ భాగాలను పాశ్చాత్య విజ్ఞానశాస్త్రవేత్తలు 'క్వాంటా' అన్నారు. దానినిబట్టి ఈ తేజోధాతువికార ప్రక్రియా ధర్మవిశేషానికి 'క్వాంటంసిద్ధాంతం' అన్న పేరు వచ్చింది. Cosmology అన్నది తత్వశాస్త్రములో ఒక భాగముగా వుంటూవున్నది. విశ్వముయొక్క పుట్టుక, రచన, స్వరూపసంస్థానము, ఆ విశ్వము యొక్క ఋతధర్మములు మొదలైన అన్నివిషయాలు శాస్త్రమునందు తాత్విక పద్ధతిలో వివరించబడి వుంటాయి. విశ్వముయొక్క సహజసిద్ధలక్షణముల తత్వము, కాలము, దేశము (space), కార్యకారణ నిరూపణము మొదలైన విషయాలనుగూర్చి కూడా యీ శాస్త్రం చెబుతుంది.

ప్రొఫెసర్ వీజెక్కర్, ఆదిమద్రవ్య సిద్ధాంతంతోసహా తక్కిన యీ రెండు సిద్ధాంతాలు గూడా సమన్వయపడేవిధంగా తన యీ నూతన విశ్వరహస్య సిద్ధాంతాన్ని రూపొందించారు.

ఆది పదార్థము లేక ద్రవ్యము ఒకటి వున్నదని, అది మామూలు కంటికి కన్పించనంతటి లఘువు, సూక్ష్మము అయినట్టిదని ప్రొఫెసర్ ఫాన్ వీజెక్కర్ అంటున్నారు. ఇది ఆయన సిద్ధాంత ప్రాతిపదిక. ఇటువంటి సూక్ష్మాతిసూక్ష్మద్రవ్య రేణుకములు $10^{40}$ కలిసిగాని ఒక ప్రోటాన్ కాదని ఆయన భావిస్తున్నారు. $10^{40}$ అనగా $10 \times 10$ అంటూ వరుసగా నలుబదిపదులువేసి గుణించవలసి వుంటుంది. ఆ అంకె కొన్ని కోట్లకోట్లలో వుంటుంది. ఒకటి వేసి దానిప్రక్కన నలుబది సున్నాలుపెట్టి, ఆ అంకెను లెక్కపెడితే ఎంతో ఈ అంకెవిలువ అంత. ఒక్క ప్రోటాన్‌లో ఆది ప్రదార్థము లేక ఆది ద్రవ్యముయొక్క రేణుకములు అన్నివున్నాయి అని; అన్నిరేణువుల సమవాయమువలన ప్రోటాన్ రూపు పొందుతున్నది అని. ప్రోటాన్ అన్నది అణువులోని ఒక "పార్టికిలు". ధనవిద్యుత్‌చేత నిబిడమై వుంటుంది. "న్యూట్రాన్"తోకలిసి ఈ 'ప్రోటాన్' అణువులో భాగంగా వుంటున్నది.

ఇచ్చట $10^{40}$ అనే అంకె వున్నది గదా! ఈ అంకెను తాను ఎట్లా సాధించగలిగింది ప్రొఫెసర్ ఫాన్‌వీజెక్కర్ వివరించియుండలేదు. ఆయన ఇచ్చట చెప్పదలచుకున్న విషయము ఒక్కటే: ప్రోటానుతో పోల్చినప్పుడు ఈ ఆదిపదార్థరేణుకము అత్యంతము సూక్ష్మమయినది. విశ్వముతో పోల్చినప్పుడు ఈ 'ప్రోటాను' అన్నది అదేవిధముగా అల్పమ్మైనది.

జగత్తు అంతవంతమా? అనంతమా? అన్న విషయం చాలా పెద్దవిషయం. ఈ విషయమును గురించి ఎన్నో చర్చలు జరిగివున్నాయి. జరుగుతున్నాయి. అందువలన విశ్వనిర్మాణ రహస్యాలకు సంబంధించిన ఎట్టి చర్చ అయినా పర్యుత్సుకంగా వుంటుంది. ఈ విషయాన్నిగూర్చి ఎన్నో పుస్తకాలు, ఎంతో సాహిత్యం వున్నది. అయితే ఇచ్చట శాస్త్రజ్ఞులలో రెండు రకాల వారున్నూ వున్నారు. కొందరు జగత్తు అంతవంతమైనదినంటే, కొందరు కాదు అన్నారు. కొందరు జగత్తు లేక విశ్వము అనియతమైనది, అపరిచ్ఛిన్నమైనది, అపరిమితమైనది అంటే, మరి కొందరు యీ జగత్తు నియతము, పరిచ్ఛిన్నము, పరిమితము అయినది అన్నారు. ప్రొఫెసరు ఫాన్ వీజెక్కరు యీ రెండవకోవ శాస్త్రజ్ఞులలోనివారు. ఆయన ఈ జగత్తు లేక విశ్వము పరిమితమ్ము, పరిచ్ఛిన్నము

అయినదంటారు. పూర్వము జగత్తును గురించి ఇదే విధముగా ఆలోచించివున్నవారికి, ప్రొఫెసర్ వీజేక్కర్ కు ఒక్కటే భేదావుంది. ఆ పూర్వులు ఈ జగత్తును మూడు పరిమాణములు కలదానినిగా మాత్రమే ఊహ చేశారు. ప్రొఫెసర్ ఫాన్ వీజేక్కర్ ఇప్పట భేదిస్తున్నారు. జగత్తుకు ఇతః పూర్వులు అనుకున్న మూడు విధముల పరిమాణములకన్నా అధికమైన పరిమాణాలు వున్నాయి అంటున్నారు. వీజేక్కర్ సిద్ధాంతం ప్రకారం జగత్తు సుసంహతిమై వుంది. కాని మూడుకన్నా అధికమైన పరిమాణాలువున్నాయి.

ఈ సిద్ధాంతం ఇప్పుడు శాస్త్రజ్ఞులను అధికంగా ఆకర్షిస్తున్నది. ఐన్‌స్టీన్ సిద్ధాంతాలు ఎంత గొప్పవో ఈ సిద్ధాంతం కూడా అంతటి గొప్పది అంటున్నవారు కొందరు వున్నారు. కొందరు ఈ సిద్ధాంతాన్ని పూర్వపక్షం చేస్తున్నారు; ఇది అసాధ్య సిద్ధాంతంఅని, పట్టి కల్పనాకథ వంటిది అని అంటున్నారు.

వీజేక్కర్ ఈ సిద్ధాంతానికి ఇంకా సుస్థ రూపం రాలేదు. ఇంకా అది ప్రాతిపదిక దశలోనే వుంది. దీనిని సమగ్రమైన సిద్ధాంతంఅనిగాని, జగత్తునుగురించి సుసంయుతమైన నిర్వచనంఅనిగాని అనలేము. ఈ విషయం ప్రొఫెసర్ వీజేక్కర్ కు కూడా తెలుసు. ఈ సిద్ధాంతం ఇంకా శాస్త్రం కాదు; 'ఫిజిక్సు'కన్నా, ఇందులో 'ఫిలాసఫీ' అధికంగా వున్నది—అని అయనే అంటున్నారు. ఎట్లా అన్నా ఫరవాలేదు. ఇప్పట ఒక్కవిషయంమాత్రం యదార్థం. ప్రొఫెసర్ వీజేక్కర్ ఇప్పట ఈ తమ సిద్ధాంతంలో 'ఫిజిక్సు'ను, 'ఫిలాసఫీ'ని సమన్వయం చేయడానికి ప్రయత్నం చేశారు. ఇప్పటికి కొన్ని శతాబ్దాలుగా శాస్త్రందారి శాస్త్రానిది, తత్వందారి తత్వానిది అయిపోతూవుంది. 'ఫిజిక్సు'కు, 'ఫిలాసఫీ'కి పడటంలేదు. ఒకదానిని చూచి ఒకటి రోయింపుగా, అవగణన జుష్టంగా వుంటూవస్తున్నాయి. ప్రొఫెసర్ వీజేక్కర్ వాని మధ్య సాన్నిహిత్యాన్ని స్నేహానుబంధాన్ని సాధించడానికి ప్రయత్నం చేశారు. అందుకోసం అన్వేషించారు. విజిజ్ఞాస చేశారు. ఆయనకు అప్పట సమన్వయ సమర్థాలైన ప్రాతిపదికలు గోచరించాయి. ఇప్పట ఒక్కటే ప్రతిబంధకం వుంది. ఆ ప్రతిబంధకం అయనకేగాక, ఆయన సాధించిన ప్రాక్ ప్రమేయ కల్పనంతో కూడా వుంది. ఇప్పుడు వీజెక్కర్ సాధించిన Hypothesis ను లేక ప్రాక్ ప్రమేయ కల్పనను ఇటు పదార్థ విజ్ఞానులు (Phsicists), అటు తార్కికు (philosophers) లు పూర్తిగా ఆమోదించరు. ముఖ్యంగా పందొమ్మిదవ శతాబ్దంనాటి విజ్ఞానశాస్త్ర దృష్టి చేత పరిమితమైన మనస్సులు కలవారికి, ఈ రకమైన ఆలోచనాధారను అంగీకరించడం మరీ కష్టంగా వుంటుంది. అయినా ప్రొఫెసర్ వీజెక్కర్ ప్రతిపాదించిన విశ్వరహస్య సిద్ధాంతాన్ని గురించి ఆలోచన చేయక తప్పని పరిస్థితి అందరికిన్నీ ఏర్పడింది. ఈ ఆలోచనలు ఇట్లా జరుగగా, జరుగగా ఎప్పుడో విశ్వరహస్యాన్ని నిజంగా తేల్చిచెప్పగల సిద్ధాంతం ఏది వున్నదో అది ఆవిష్కారం చెందవచ్చు.

—ఒక విజ్ఞాని.

---



# ఊరు నిదరోయింది

శ్రీ పణతుల రామచంద్రయ్య

తెలతెలవారుతుండగా బస్తీలో బయల్దేరిన బస్సు ఆ వూరు చేరేసరికి బాగా పొద్దెక్కింది. బస్సు ఆగగానే కండక్టరు తన పక్కనే కూచుని కునికిపాట్లు పడే జగన్నాథాన్ని ఒక్క కుదుపు కుదిపి, 'ఇంక దిగవయ్యా' అని గదమాయించాడు.

కంగారుపడుతూ బస్సు దిగాడు జగన్నాథం. అతడా కంగారులోంచీ తేరుకుని చూసేలోగా బస్సు అల్లంతదూరంలో దుమ్మురేపుతూ వెళ్ళిపోతోంది. జగన్నాథానికి కండక్టరుమీద కోపం వచ్చింది తనని అలా గదమాయించినందుకు. తను కలక్టరయివుంటే యిలాంటి కండక్టర్లనందరినీ ఆ కనబడే తాటిచెట్లకు వేళ్ళాడగట్టి వురితీసి వుండును.

తను కలక్టరు కాలేదు. అయివుంటే ఆవార్లగారి రాజి పెళ్ళిచేసుకునేదేమో తనని! ఆ పిల్ల యిప్పుడెవడో పైలట్ ఆఫీసర్ని పెళ్ళాడి ఢిల్లీలో నిత్యం విమానాల్లో తిరుగుతోందట. ఆ రోజున తను వెళ్ళి 'నన్ను పెళ్ళాడతావా?' అంటే, 'నిన్నా?' నిన్నే!!' అంటూ ఆశ్చర్యపడిపోయింది. అవును, ఏంచూసి చేసుకుంటుంది, తను గుమాస్తా పనికోసం అవతరించిన కారణజన్ముడని తెలిశాక?...కాని తను రాజిని ప్రేమించాడు. ఆ మాటకొస్తే తను చాలామంది అమ్మాయిల్ని ప్రేమించాడు. వాళ్ళంతా తన ప్రేమకు బెదిరి పరుగెత్తారు, ఒక్క కాంతమ్మతప్ప. కాని కాంతమ్మకు దూరంగా తను పరుగెత్తాడు.

ఆలోచించటం మాని ఒక్కసారి ఊరివేపు చూశాడు జగన్నాథం. ఊరు మారలేదు. ఏడేళ్ళ కిందట పెట్టె చేత్తో పట్టుకుని బస్తీదారి పట్టుకుని వెళ్ళిపోయే తనని చూసి అంటీఅంటనట్టుగా నిదరోయిందీ వూరు. ఇప్పుడూ అలాగే నిదరోతోంది.

కాలకృత్యాలు తీర్చుకుందామని వూరి చివర వున్న వినాయకుడి చెరువు దగ్గరికి వెళ్ళాడు జగన్నాథం. వినాయకుడి చెరువు పెద్దది. ఆ చెరువు తవ్విస్తున్నప్పుడు వినాయకుడి విగ్రహం ఒకటి దొరకటంవల్ల దానికాపేరు వచ్చిందట. ఒకప్పుడు చెరువు నిండా తామరపూలుండేవి. జగన్నాథం, అతడి జట్టులో వున్న ఆడపిల్లలూ చిన్నప్పుడు రోజూ అక్కడికి వచ్చేవాళ్ళు. గట్టుమీద నిల్చుని చేతికందిన చిన్నచిన్న తామరమొగ్గలన్నీ వాళ్ళకు కోసిపెట్టేవాడు తను. లోపలికి దిగాలంటే భయం. నీళ్ళు నల్లగావుంటాయి.

జగన్నాథం పళ్ళు తోముకుని స్నానం చేశాడు. సంచిలోంచీ విస్త్రీపంచె తీసి కట్టుకుని, తడిసిన పంచె ఆరగట్టాడు.

ఇంతలో బిందె చంకన బెట్టుకుని కాంతమ్మ అక్కడికి వచ్చింది. చెరువులో నీళ్ళు శుభ్రంగా తియ్యగా వుండటంవల్ల వూళ్ళో చాలామంది తాగటానికి ఆ నీళ్ళే తలో బిందెడు ముంచుకుపోతుంటారు.

జగన్నాథాన్ని చూడగానే మొదట ఆశ్చర్యపోయి తరువాత సిగ్గుపడుతూ 'ఎప్పుడు రావటం?' అంది కాంతమ్మ.

'పొద్దున్నే'

మళ్ళీ ఆశ్చర్యపోయింది కాంతమ్మ. 'మరి యింటికి రాలేదేం?'

'రాలేదు'

'అదే ఎందుకు రాలేదూ అని అడుగుతున్నాను.'

అతడు జవాబు చెప్పలేదు. కాంతమ్మ మొహంలోకి చూస్తూ 'బాగా మారిపోయావు సుమా! అన్నాడు!' 'నిజానికి ఏమంత మారిపోలేదు' అనుకున్నాడు లోలోపల. ఏడేళ్ళకిందటి నిద్దమైన రంగూ, లావూ, అదే బర్మాముడీ, ఆ ముడిమీదికి

వచ్చేట్టు పమిట కప్పుకోవటమూ...

'ఇంటికి రావా?' అంది కాంతమ్మ.

'వస్తాను.'

'మరిచి పోయ్యాను నీతో చెప్పటానికి...రాజి యిక్కడే వుంది. నిన్ను గురించి అనుకుంటూ వుంటుంది కూడా.' అంది కాంతమ్మ. కాంతమ్మా, రాజీ అక్కచెల్లెళ్లు.

'ఏమని? పీడావదిలి పోయిందనా?' నవ్వాడు జగన్నాథం. 'పీడ' అంటే తనని పెళ్లిచేసుకోవటం. తను రాజిని పెళ్లాడాలనుకోవటం జగత్ప్రసిద్ధం కనుక అలా అన్నాడు.

ఈ మాటకు కాంతమ్మ నిట్టూర్చి, 'అలా జరిగినా బాగుండిపోయేదేమో!' అంది. జగన్నాథం ఆశ్చర్యపోయాడు. ఎలా జరగటం? రాజికి తన పీడ వదిలిపోవటమా? తనా పిల్లను పెళ్ళిచేసుకోవటమా?

కాంతమ్మ నీళ్ళు ముంచుకుని వెళ్ళిపోతోంది.

ఆమె హంస నడకమూ, పిరుదులపైకి పారాడే జడను చూస్తూ 'ఇంకా అలంకారాలు తగ్గలేదు మనిషికి!..ఎంతయినా నాయుడుగారి ప్రియురాలుకదా!' అనుకున్నాడు జగన్నాథం.

కాంతమ్మ తనకన్నా రెండుమూడేళ్లు చిన్నది. ఊరి బళ్లో తనతో కలిసి చదివింది. తరువాత చదువు మానేసి యింట్లో వుండిపోయింది. అలా వున్న రోజుల్లోనే ఒక సాయంత్రం తను సమయం చూసి వెళ్ళి ఆ పిల్లను నడుముచుట్టూ చెయ్యివేసి ముద్దు పెట్టుకున్నాడు. ఆ పిల్ల ఏమీ అనలేదు.

అంతకుముందే, జ్ఞాపకానికి అందని రోజుల్లో, కాంతమ్మకు పెళ్లయింది. పెళ్ళయిందేకాని కాంతమ్మ భర్త నెప్పుడూ చూడలేదు. ఆ అబ్బాయి కూడా ఒకమారైనా అత్తగారింటికి వచ్చిన పాపాన పోలేదు. ఉన్నట్టుండి ఒకరోజతడు తనని కాలేజీ చదువులకు పంపించలేదని యింట్లో పెద్దవాళ్ళతో దెబ్బలాడి వెళ్ళిపోయాట్ట. మళ్ళీ జాడలేదు. అతడు యింట్లోంచీ వెళ్ళిపోయినట్టు తెలిసిన రోజున ఆచార్లుగారింట్లో అందరూ దుఃఖించారు. కాంతమ్మకు మాత్రం ఏం చెయ్యాలో తెలిపిందికాదు. వివాహమనే ఒక వ్యవస్థ తన జీవితాన్ని మరో అపరిచిత వ్యక్తి జీవితంలో శాశ్వతంగా ముడివేసిందనీ, ఆ వ్యక్తి యింట్లోంచీ పారిపోవటమంటే తన జీవితంలోంచి వెలుగు పారిపోయి చీకటి పీఠం వేసుకోవటమేనని తెలియని వయస్సది. అంచేతనేమో, యింట్లో వాళ్ళందరికీ దుఃఖం కలిగించిన ఆ సంఘటన ఆమెకు అవమానంగా తోచింది. ఆ 'భర్తగాడి'మీద కోపం కూడా వచ్చింది. ఆ సంగతి ఎలాగో తెలుసుకున్న తోటి కుర్రాళ్ళంతా కాంతమ్మను ఎగతాళి చేశారు. తను మరీని. 'కాంతమ్మా చక్కని బొమ్మా, నీ మొగుడే రబ్బరు బొమ్మా' అని పాట కూడా పాడాడు. తన పరిహాసానికి కాంతమ్మ కోపంతో వుడుక్కుంది. ఆ తరవాత ఎప్పుడేనా భర్త ప్రసక్తివస్తే, 'వాడొక ముదనష్టపోడు' అనేది కాంతమ్మ.

బాగా పొద్దెక్కింది, దొరువుదగ్గర పొలానికి నీళ్లెత్తుతున్న పేర్యిగాళ్లు పని ఆపి, ఇంటి దగ్గర్నుంచీ తెచ్చుకున్న అన్నంమూటలు విప్పి తినటానికి జగన్నాథం కూచుని వున్నచోటికి వచ్చారు. అక్కడ దొరువునీళ్ళు నాచూ బురదా లేకుండా మరింత లేటగా వుంటాయి...వాళ్ళలో గెడ్డమూ, మీసాలూ ఒత్తుగా పెరిగివున్న ఒక వ్యక్తిని జగన్నాథం పోల్చుకున్నాడు.

ఆ మనిషిపేరు రామిగాడు. ఊళ్లో నాయుడి అకృత్యాలకు గురైన వాళ్ళలో ఒకడు. వాడి కొక కూతురుండేది. ఆ పిల్లపేరు మంగి. ముద్దబంతి పువ్వులాంటి మంగిశవం ఓ రోజు ఊరి వెలుపల కాలువలో తేలింది. అందుకు కారణం నాయుడు ఆ పిల్లను చెరచటమేనని వూరంతా గుప్పుమంది. రామిగాడు కంటికి మింటికి ఏకధారగా ఏడ్చాడు. పోలీసు రిపోర్టిచ్చాడు. కాని వినిపించుకునే నాథుడు లేడు. నాయుడు వేలు గుమ్మరించి తప్పించుకున్నాడు.

రామిగాడు జగన్నాథానికి దగ్గరగా వచ్చి, 'ఎవురదీ? జగ్గయ్య బాబుగోరేనా?'అన్నాడు. చిన్నప్పట్నుంచీ జగన్నాథాన్ని వూళ్లో అందరూ జగ్గయ్య అని పిలిచేవాళ్లు.

'ఆఁ..' అన్నాడు జగన్నాథం.

'ఎక్కడుంటున్నారు బాబుగోరు ?'

చెప్పాడు జగన్నాథం.

'ఏదన్నా నౌకరీ...'

జగన్నాథం విసుక్కున్నాడు. ఈ పల్లెటూరి వాళ్ళకు అక్కరలేని సమాచారమంటూ లేదు!...ఏదో గొణిగాడు. కాని అంతలోనే మళ్ళీ రామిగాడిమీద జాలివేసింది. చిన్నతనంలో తను యింట్లో అల్లరి చేసి నాన్నచేత చావుదెబ్బలుతిని అలిగి రామిగాడి గుడిసెకు వెళ్ళేవాడు. సాయంత్రం తనని వెదుక్కుంటూ ఎవరో ఒకరు వచ్చేదాకా అక్కడే వుండి పోయేవాడు. ఆ గుడిసెలో వుండేది రామిగాడూ, వాడి కూతురు మంగీ. మంగి వాళ్ళిద్దరికోసం కుండలో అన్నం వండేది. ఒక్కొక్కరోజు చేపలు తరుగుతూ వుండేది. తను ఆ వాసన భరించలేక ముక్కు మూసుకునేవాడు. మంగి నవ్వేది.

'వెధవ చేపలు తినేకంటే హాయిగా కాయగూరలు తెచ్చి వండుకోగూడదూ?' అనేవాడు తను.

'బాపనోడివి. నీకేం తెలుస్తుంది యీటి రుసి? అనేది మంగి. మంగి ఎంత మంచిదో అంతపెంకెది. కళ్ళు ఎంత చురుకైనవో మాట అంత పెళుసైనది. ఎవరంటేనూ భయంలేదు. చివరికి తన కోసం వలవేసిన నాయుడికికూడా భయపడలేదు. మానంకోసం ప్రాణం పణంగా పెట్టింది. ఓడిపోయింది నాయుడేనని యిప్పటికీ తన అభిప్రాయం.

మిట్ట మధ్యాన్నమయింది. జగన్నాథం కాంతమ్మ యింటికి బయల్దేరాడు. వినాయకుడు దొరువు దగ్గర్నుంచీ ఆచార్లు గారింటికి అరమైలు దూరం. దారిలో గ్రామశక్తి అంకాళమ్మ గుడివుంది. ఆ రోజక్కడ ఏదో జాతర జరుగుతున్నట్టుంది. గుడి చుట్టూ జనం మూగారు. తప్పెట్లూ కొమ్ములూ మోగిపోతూంటే, వాటి దరువుకు అనుగుణంగా కొందరు చేతిలో వేపమండలు పట్టుకుని చిందులు వేస్తున్నారు. మధ్య మధ్య కోళ్ళూ మేకలూ తెగి పోతున్నాయి. మేకను నరికినప్పుడల్లా అందరూ మరింత కోలాహలంగా ఆనంద నృత్యం చేస్తున్నారు.

ఆ బీభత్స దృశ్యం చూడలేక గబగబా నడిచి వెళ్ళాడు జగన్నాథం. ఆచార్లు గారిల్లు చేరి తలుపు తట్టాడు.

తలుపు తెరుచుకోగానే అతనికి కనబడింది రాజి. రాజిలో అప్పటి అందం, కళ్ళలో అల్లరి వెలుగూ, కవ్వించే శరీరపు సునవూ లేవు. అతడికి ఆశ్చర్యం వేసింది.

'నేనేలే. చాలా ఆశ్చర్యంగా చూడకు లోపలికిరా' అంది నవ్వుతూ రాజి.

మాటలమధ్య అతడన్నాడు. 'అయితే యిప్పుడు యింట్లో మీ అక్క చెల్లెళ్ళిద్దరే వున్నారన్నమాట. రాజీవాళ్ళ తల్లిదండ్రులు రెండేళ్ళ కిందటపోయిన విషయం అతడి కింతకుముందే తెలుసు.

'మే మిద్దరమూ, ఆయనాను' అంది రాజి.

'ఆయన' ఎవరో జగన్నాథానికి ఓ పట్టాన అర్థం కాలేదు. అడిగి తెలుసుకుందామనుకుంటున్నంతలో లోపల్నుంచి కాంతమ్మ వచ్చింది.

'నువ్వు లోపలే దక్కునివున్నావన్న మాట.... ఇదేనా, యింటికొచ్చిన చుట్టాన్ని మర్యాద చేసేపద్ధతి?' అన్నాడతడు నవ్వుతూ.

ఆ మాటకు కాంతమ్మకూడా నవ్వుతోంటే, రాజి అంది. 'పూజలో వుండిపోయిందిలే. ఈ విడ కీ మధ్య ఆధ్యాత్మికపిచ్చి ఎక్కువయింది....'

'చేసే పాపాలకు పరిహారంకోసం గాబోలు' అనుకున్నాడు జగన్నాథం.

'పొద్దున నే పిలవగానే వస్తానన్న వాడివి యిప్పటి దాకా ఏం చేస్తున్నట్టు?' అంది కాంతమ్మ.

'ఎవరో కనబడితే మాట్లాడుతూ వుండి పోయాను.' చిన్న అబద్ధం ఆడాడు.

'కాఫీ ఎక్కడ తాగావు? మీ బస్తీలో లాగా యిక్కడ హోటళ్ళయినా లేవు గదా!'

'తాగలేదు' ఈ మారు నిజం చెప్పక తప్ప లేదు అతడికి.

'మంచివాడివే. నేను అదేపనిగా రమ్మని చెబితే రాకుండా మంచి నిర్వాకమే....లే, కాళ్ళు కడుక్కుని భోం చేద్దువుగాని.'

అతడు కాళ్ళూ చేతులూ కడుక్కుందామని వెళ్ళుతోంటే పెరటివేపు వసారాలో మంచంలో పడుకున్న ఒక వ్యక్తి కనిపించాడు. అతడికి మంచంలోంచి కదిలేశక్తి వున్నట్టులేదు. పడుకుని చల్లగాలికి హాయిగా నిద్రపోతున్నాడు.

తరువాత జగన్నాథానికి వడ్డిస్తూ కాంతమ్మ చెప్పింది. ఆ వ్యక్తి రాజి భర్తట. ఢిల్లీలో ఉద్యోగం

చేస్తున్న రోజులో అతడికి పెరాలిసిస్ వచ్చిందట. ఫలితంగా వుద్యోగంలోంచి తీసేశారట. అప్పట్నుంచీ అతడుకూడా యిక్కడే వీళ్లతోబాటు వుంటున్నాడట.

ఇదంతా చెప్పి కాంతమ్మ అంది. 'అతడిప్పుడు మాకు కాస్త మగదిక్కుగా వుంటున్నాడనుకో. కాని దాని రాత యీ విధంగా తయారయింది. అప్పట్లో నువ్వు దాన్ని చేసుకోవాలని ఎంత పాకులాడావో నాకు తెలుసు. అలా జరిగివున్నా దాని బ్రదుకిలా అధ్వాన్నం కాకపోను' కన్నీళ్లు తుడుచుకుంది కాంతమ్మ. కాంతమ్మ చిన్నప్పటినుంచీ మహామెత్తక మనిషి. ఆవేశాలకు ఇట్టే లొంగిపోతుంది.

అతడికి సందేహంగా వుంది. తను రాజిని చేసుకోవాలనుకోవటాన్ని యీవిడ క్షమించ గలుగు తోందా?

'అతణ్నే ప్రశాంతంగా భోంచెయ్యనీవా నువ్వు? మాటలకూ కన్నీళ్లకూ యిదేనా సమయం?' అంటూ వచ్చింది రాజి.

రాజి అతడి పక్కనే మరో రెండు విస్తళ్లు వరుస్తుండటం చూసి 'ఎవరికి?' అని అడిగాడు జగన్నాథం.

'మాకే'

'ఇంకా మీరు భోంచెయ్యలేదా?'

'బాగుంది...మగవాణ్ని వదిలిపెట్టి ముందు గానే ఆరగింపులుచేసే నాగరికం మాకింకా రాలేదు' అంది కాంతమ్మ నవ్వుతూ.

'ఆహా! ఎంత నియమం!' అనుకున్నాడతడు. ఎందుకీ సంప్రదాయప్రియత్వపు నటన?

'నీ సంగతి ఏమోకాని, రాజికివ్వాళ్టం మహా ఆకలిగా వున్నట్టుంది.' అన్నాడు.

'నీ కెలా తెలుసు?' అంది రాజి.

'అందుకేగా నన్ను త్వరగా భోంచెయ్య నిమ్మని యిందాక మీా అక్కయ్యను తొందరపెట్టావు? లేక పోతే నువ్వామాట నా మీద ప్రేమతో చెప్పావనుకో మంటావా?'

'వద్దులే' అంది రాజి.

అతడి మనస్సు చివుక్కుమంది.

భోజనం పూర్తిచేసి చెయ్యి కడుక్కుని వెళ్లి హాల్లో ఆలోచిస్తూ కూచున్నాడు. కాంతమ్మ వక్కపొడి, తమలపాకులూ తెచ్చి పక్కనేపెట్టి వెళ్లిపోయింది. అక్కచెల్లెళ్లిద్దరూ మౌనంగా భోంచేస్తున్నారు. వాళ్లు ఏమైనా మాట్లాడుకుంటారేమో, ఒకవేళ రాజి తనను గురించి ప్రేమపూర్వకంగా ఏమన్నా చెబుతుందేమో విందామని అతడి ఆశ. కాని అలా మాట్లాడుకోవటానికి సరిపడ్డ ఆలోచనల సామరస్యం వాళ్లిద్దరికీ వుందా?

అక్కచెల్లెళ్లిదరూ రూపంలో ఒకే మూసలో కరిగించిన రెండు బొమ్మల్లావున్నా, స్వభావాల్లో ఇద్దరికీ ఎంతో తేడా వుంది.

స్ఫూర్తిమంతమైన విగ్రహంతో, మోహన దీపశిఖలాంటి సింధూర తిలకంతో, కట్టుకున్న కంచి పట్టుచీరచెరగు భుజంనిండా లాక్కుంటూ నవ్వుతూ ఆప్యాయత చిలకరిస్తుంది కాంతమ్మ. కాని యింత ఆదరణా సర్పాన్ని మరుగుపరచే సంపెంగ పువ్వు లాంటిది. కాంతమ్మ మనసు గొప్పదే. కాని....తను కళ్లారా చూశాడు. ఆ క్షణందాకా తను కాంతమ్మ మీద ఆశలు పెంచుకున్నాడు. కాంతమ్మ మొగుడు చిన్నతనంలోనే అలా వెళ్లిపోవటం తన అదృష్టమను కున్నాడు. మారుమనువు మంచిదికాదనే బంధువుల్ని ధిక్కరిస్తూ, కాంతమ్మతోటి రంగుల భవిష్యత్తును గురించి కలలు కన్నాడు. ఆ కలల్లోంచీ వికృత సత్యాలలోకి తనని మేల్కొలిపింది కాంతమ్మ.

రాజి స్వభావం వేరు. కాంతమ్మలోని మెత్తదనం రాజిలో లేదు. కాంతమ్మలా రాజి మనుషుల్ని ప్రేమించలేదు. కాని రాజికి నడవడి వుంది. ఆమె కాంతమ్మలాగా రక్తానికి లొంగిపోయే మనిషి కాదని తన నమ్మకం.

అందుకే తను కాంతమ్మను మరిచిపోయి రాజిని పెళ్లి చేసుకుందామనుకున్నాడు. ఆ మాట పైకీ అన్నాడు కూడా. ఆ సంగతి తెలిసినప్పుడు కాంతమ్మ తనని ఏమీ అనలేదు. అప్పటికి కాంతమ్మతో తన వ్యవహారం పెళ్లి ప్రస్తావనదాకా వచ్చివున్నా, తన లోని యీ ఆకస్మికమైన మార్పును కాంతమ్మ ప్రశ్నించలేదు. కాంతమ్మ తన దగ్గరికి వచ్చి ఇలా చేశావేమిటని అడుగుతుందనీ, అప్పుడు తను ఆమెని

నాలుగూ దులిపి 'చేసినదానికి అనుభవించు' అనేయ వచ్చనీ అనుకున్న తనకి ఆశాభంగమయింది. కాంతమ్మ నిశ్చలంగా వుండిపోయింది.

'మనిషికి అహం, నాయుడంతటివాడు తన కొంగుముడిలో వున్నాడని' అనుకున్నాడుతను.

కాని రాజి తనని నిదిలించి కొట్టింది. ఆ రోజున తనువెళ్ళి 'నన్ను పెళ్ళాడతావా?' అంటే 'నిన్నా?? నిన్నే??' అంటూ ఆశ్చర్యపడిపోయింది. మరి యిప్పుడో! అహో రాత్రాలూ పరిచర్యలు చెయ్య వలసిన భర్తతో, మగదక్షతలేని యింట్లో, ఆ పిల్ల భవిష్యత్తంతా చీకటయి పోలేదూ?

సాయంత్రమయింది.

రాజి పింఛ పోసికట్టిన చీరతో, తల్లో వత్తుడు మల్లెపూలతో అతడి ఎదుటవచ్చి నిలబడింది.

'ఏమిటీ వేషం?' అన్నాడతను. రాజి అలా చీర కట్టుకోవటం అతడింతకు ముందెప్పుడూ చూడలేదు.

'ఉద్యోగధర్మం' అంది రాజి.

'అంటే?'

'అంటే, సాయంత్రం గుళ్ళో దీపం వెలిగించ టానికి యీ వేషంలో వెళ్ళాలి.

'ఓహో! పూర్వం అంటే ఒకనాటి బంగారు కాలంలో కాంతమ్మ చేసేది యీ వుద్యోగం. ఇప్పుడు నీ కప్పగించిందన్నమాట!' అన్నాడతడు.

'ఇప్పుడు కొత్తగా అప్పగించటమేమీ లేదులే. ఎవరికి వీలయితే వాళ్ళం చేస్తుంటామీ పని. నువ్వు చెప్పే ఆ బంగారు కాలంలోకూడా అప్పుడప్పుడూ, నా కవసరమైనప్పుడు నేనే వెళ్ళేదాన్ని గుడికి.'

అవసరమా? అతడికేం అర్థం కాలేదు.

అతడి వాలకాన్ని చూసి 'అవును నువ్వు గమనించ లేదంతే. నువ్వు కళ్ళున్న గుడ్డి వాడివి' అంటూ వెళ్ళిపోయింది రాజి.

చీకటి పడింది. కాంతమ్మ లోపల వంట చేస్తోంది, ఏవో పూజా శ్లోకాలు చదువుతూ.

అతడులేచి వూళ్ళోకి బయల్దేరాడు. వీథమ్మట నడవ సాగాడు. ఊళ్ళో అదే కాస్త పెద్దవీథి. వీధి కిరుప్రక్కలా చెలా చెదురుగావున్న యిళ్ళలో దీపాలు మినుకుమినుకుమంటున్నాయి.

దుక్కముక్కల రంగయ్య యిల్లు వచ్చింది. ఇంటి చూరుకింద కుక్కి మంచంలో పడుకుని దగ్గుతున్నాడు రంగయ్య. తనుపుట్టి బుద్ధెరిగి నప్ప ట్నుంచీ అతడలాగే దగ్గుతున్నాడు. చిన్నప్పుడు తమ యింట్లో చెల్లాయి ఎప్పుడేనా మారాంచేస్తే అమ్మ దాన్ని బెదిరించేది. 'దుక్కముక్కల రంగయ్యకిచ్చి పెళ్ళి చేస్తా'నంటూ. రంగయ్య యింటికి చేతివేటు దూరంలో కరణం యిల్లు. కరణం యిల్లుదాటి నాలుగు బారలు నడిస్తే వూరి మునసబునాయుడి యిల్లు.

నాయుడు రసికుడు. జీవితంలో ఆనందాన్ని రెండు చేతులా, అది ఏ మార్గంలో వచ్చినాసరే, జుర్రుకోవాలన్న నియమం వున్నవాడు. అతడీనాటి వరకూ ఆ నియమాన్ని నిరంతరాయంగా ఆచరిస్తూనే వున్నాడు. నాయుడిది ఇంచుమించు తన వయస్సే. పెళ్ళయింది. అతడి పూర్తిపేరు కృష్ణమనాయుడు. అది వాళ్ళ తాతగారి పేరట. వాళ్ళ తాతకు అగ్ని సాక్షిగా పెళ్ళాడిన భార్యవున్నా, అసలు భోగం అంతా ఆయనకు జీవితాంతం శాశ్వతహక్కుభుక్తంలోవున్న ఎవరో రాజరత్నమ్మకే దక్కిందట. తను ఆ తాతగారి మనవడే కాబట్టి పైపెచ్చు తాతగారి నామధేయం ధరించినవాడుకాబట్టి, నడవడిలోకూడా తాతగారినే ఒరవడిగా పెట్టుకున్నానని సగర్వంగా ప్రకటించు కుంటాడు, దక్షిణ నాయకుడైన ఈ చినకృష్ణమ నాయుడు. ఊళ్ళో అతడి యీ దక్షిణ నాయకత్వా నికి తమ బ్రదుకులు పణంగా పెట్టకుండా, అతడి ఆకలిచూపుల్లో పడకుండా తప్పించుకున్న ఆడపిల్లలు తక్కువ. అలా తప్పించుకోలేని ఆడపిల్లల్లో లోకాని కంతా తెలిసిన కథ మంగిది. లోకాని కేమాత్రం తెలీ కుండా తనకే తెలిసిన కథ కాంతమ్మది.

నాయుడి యిల్లుదాటి, వీధిలో యిళ్ళన్నీ దాటి, వీథి చివరవున్న విష్ణ్వాలయంలోకి వెళ్ళాడు జగన్నాథం. తమ కుటుంబం యీ వూళ్ళో బాగా బ్రదికిన రోజుల్లో యీ ఆలయంలోని చెన్నకేశవుడు తమ యింటి వేలుపు. అప్పుడు దేవుడికి నిత్యమూ పూజ, ఏటా వుత్సవాలూ జరిగేవి. ఇప్పుడదేం లేదు, రోజూ

ఆచార్లుగారింటి అక్క చెల్లెళ్ల తగూలా మంత్రంగా వేసే అక్షింతలు తప్ప.

రాత్రి.

ఊరూ వాడా చీకటి పొరాయి తాగి మైకం తెప్పు కుంటున్నాయి.

ప్రాకారం లోపల ధ్వజస్తంభం అరుగుమీద కూచున్నాడు జగన్నాథం.

ఆలయానికి ఒకవేపు పూరు. మరోవేపు చింత చెట్లూ, బ్రహ్మమేడి పొదలూ. ధ్వజస్తంభానికి ఆను కుని కూచుని ఆలోచిస్తున్న జగన్నాథానికి ఆ పొదల చాటున రెండు ఆకారాలు లీలగా కనిపించాయి. మరు నిముషంలో వాయుడు పై పంచె విదిలించుకుంటూ వూళ్లో కేసి నడిచిపోవటం స్పష్టంగా కనిపించింది.

జగన్నాథం కళ్లు పెద్దవి చేసుకుని చూశాడు.

ఆ రెండో ఆకారం కాంతమ్మ గారివల్లు! అయితే యీ వ్యవహారం ఆనాటిమంచీ యిప్పటిదాకా సాగుతోనే వస్తోందన్నమాట!

పింఛపోసి కట్టిన చీరా, నల్లని రవికా, తల్లో వూలూ— ఆ ఆకారం జగన్నాథం వేపే వస్తోంది.

"ఎవరూ ?" అన్నాడు.

'నేను'

అది రాజీ గొంతుక!

'రాజీ!'

'అవును, నేనే'

'ఇవాళప్పు డెందుకొచ్చావు?' అన్నాడు.

'మరీ అలా నటించకు. నేనేమంత సిగ్గులో చచ్చిపోవటం లేదులే. అసలు మొదట్నుంచీ నీకీ విషయం తెలిసివుంటే ఎంత బాగుణ్నో అనిపిస్తోంది."

"నాకు పూర్తిగా తెలుసు."

"తెలీదు," దృఢంగా అంది రాజి, "ఏనిమి దేళ్ల కిందట అరోజు మమ్మల్ని అదేచోట చూసి నప్పుడు, నన్ను చూసి కాంతమ్మ అనుకున్నావు నువ్వు, అప్పుడు గుళ్లో దీపం పెట్టటానికి కాంతమ్మే వస్తూండేది కాబట్టి. ఆ అపోహతోనే నువ్వు కాంత మ్మను పెళ్లి చేసుకోలేదు. అందుకే సాయంత్రం నిన్ను నేను కళ్లున్న గుడ్డివాడి వన్నది ...... కాని కాంతమ్మ కిలాంటి వ్యవహారాలు అంటగట్టడమే పాపం. అది నిప్పులాంటిది. అయినా దేవుడు దాన్ని బదుకు వలా ఎందుకు చేశాడా అనిపిస్తుంటుంది నాకు..."

అత డలాగే అచేతనంగా కూచున్నాడు.

రాజి వెళ్లిపోయింది.

గుడ్డి వెన్నెల చింది అక్కడక్కడా తెల్లని మరకలు పడినట్లున్న సీలాకాశపు తెర ఎదుట, గత వైభవపు ఛాయల్ని నెమరువేస్తున్న శిథిల దేవాలయ గోపురం మౌనంగా నిల్చుంది.

ఊరు నిదరోయింది.

---



చదువుకోవటానికి సరదాగా వుంటాయికాని, పూర్తి వాస్తవాలా అనేది అనుమానం. 'నవ్వులూ-పువ్వులూ'లో పదిహేను సంవత్సరాల 'జయప్రద' తల్లితండ్రులు అంత త్వరగా తనకు పెళ్ళిచేసినందుకు ఏడుస్తుంది. అదే వయసు సావిత్రి తనకింకా పెళ్ళిచేయలేదని ఏడుస్తుంది. 'పెళ్ళి కావాలి'లో చిన్న వయస్సులో పెళ్ళయి తల్లిఅయిన 'పల్లి'ని చూచి మంచంపట్టిన పావని మనస్సులోని మాట పెళ్ళికావాలని పల్లి పెళ్ళి గ్రక్కింది. 'మతులెన్ని చెప్పినా'లో నా కసలు పెళ్ళే వద్దు అంటున్న మధుమతిని పెళ్ళికి ఒప్పుకొనేట్లు చేయటానికి, పెళ్ళాం పిల్లలున్న తమ్ముడికి కబురు పెట్టిన అక్కమాట కాదనలేక వచ్చిన తమ్ముడు, చేసిన ప్రయత్నఫలితం మామయ్యనుతప్ప మరొకర్ని చేసుకోననే మధుమతి నిర్ణయం. 'చంద్రకాంత'లో సౌందర్యవతి, గుణవతి, ధనవతి అయిన చంద్రకాంత, వచ్చిన పెళ్ళి సంబంధాలకు వంకలుపెట్టి తరిమి, చివరకు సంగీతం మాష్టరును పెళ్ళాడు తాననటం వింత ప్రకృతి. ఈ కథలలో వాస్తవికత ఎలా వున్నా, యువతుల మనస్తత్త్వం మాట ఎలా వున్నా, రచనలు చదివి, పుస్తకం దూరంగావుంచి, సరదాగా నవ్వుకోవటానికి వీలయినంత అవకాశం.

జగత్తు అంతా ఏకకుటుంబంగా, జనమంతా ఒకతల్లి పిల్లలుగా భావించటంలో ఆనందం, ప్రవర్తించటంలో పరమానందం, పరమార్థం వున్నాయి. ఏ పాపాయిని చూచినా నా పాపాయితో సమానం అనుకోగలిగిన మనస్తత్త్వం విశిష్టమయింది. 'పెళ్ళి కావాలి'లో సుజాత, పావనిని అలాగే చూచుకొంది. తను తల్లి అయిన తర్వాత చూడలేకపోయింది. ఇంతకు పైమెట్టు 'తప్పటడుగు'. పిల్లలు కలుగకముందు భర్త అధ్యాపకుడుగా బడిపిల్లలలో తన సంతోషం నిక్షిప్తం చేసుకొంటే, భార్య నర్సుగా వార్డులో పిల్లలలో ప్రేమదాచుకొంది. తమకు కొడుకుపుట్టాక, భార్యాభర్తలు ఆయా బాలబాలికలకే కాదు, ఉద్యోగ ధర్మానికికూడ దూరం అయిపోయారు. పుట్టిన బిడ్డ గిట్టటంతో మళ్ళీ ఆ పిల్లలతో ఆత్మానుబంధం పెంచుకోసాగారు. ఈ కథలో రచయిత, సార్వజనీనమయిన సత్యసందర్శనంచేసి, మానవతావాదం; ప్రేమమయ జీవితంలో కారుణ్య ప్రవృత్తిలో, సర్వసృష్టీ తమ సంతతిగా భావించటంలో ప్రత్యక్షీకరించుకోవాలని ఇచ్చిన తీర్పు ఉదాత్తమయింది.

సంతానం కలగకపోతే తల్లడిల్లిపోవటం ఉచితమే! ఎంతకీ పిల్లలు కలగకపోతే ఏదోవిధంగా తల్లిదండ్రులం కావాలనే తాపత్రయంతో పిల్లల్ని దత్తత తీసుకోవటం లోకంలో వింతకాదు. నెత్తిన కొరివి పెడతాడనుకొని దత్తత తీసుకొన్న కొడుకు నెత్తిని కొరివి పెట్టవంసివస్తే, ఆ గతి, కొడుకు చెడ్డఅలవాట్లవల్ల వస్తే, అందుకు కొంతవరకు తనదే బాధ్యత అయితే, తండ్రి పొందే వ్యథకు నిదర్శనం 'పున్నామనరకం'. నిత్యం రంపపు కోతకు గురై, బలై పోయిన కూతుర్ని తలుచుకొంటూ కుమిలిపోయే భార్యాభర్తలు, తమ కూతురుస్థానంలో ఒక అనాథను నిలుపుకోవటం మానవత్వం. 'వినిపించని స్వరాలు'లో వినిపించే స్వరం ఎలుగెత్తిచాటే సత్యం మానవత్వం. శ్రీ శాస్త్రిని మానవతావాదిగా పాఠకులు గుర్తిస్తారు.

'వలపులో మలుపు' చదివిన తర్వాత, O. Henry కథ, The Gift of Magi గుర్తుకు వస్తుంది. శ్రీ శాస్త్రి కథలో ఆకథకంటే మార్పు వున్నా, పై కథ ప్రభావం వుందనకతప్పదు. O.Henry కథలో ఉన్నంత గంభీరత, ముగింపులో ఉన్న పటిష్ఠత ఈ కథలో లేవు.

బస్సులు జాతీయం చేయటంవల్ల కలిగే లాభ నష్టాలు చెప్పలేదుగానీ, జాతీయం చేయకపోతే కలుగుతున్న కష్టనష్టాలు 'తలపులో మలుపు'లో వాస్తవికంగా చిత్రితమయ్యాయి. సమకాలీన సమాజ సమస్యలపై రచనలు వెలువడుతున్నాయి గానీ, ఇటువంటి వస్తువు ఏ కొద్దిమందో స్వీకరిస్తారు. శ్రీ శాస్త్రి కథా నిర్వహణ సంతృప్తికరంగా వుంది.

తెలుగువాళ్ళపై మామ్మల ప్రభావం అంతో ఇంతో వుంటుంది. మామ్మలు లేని ఇళ్ళు అరుదుగా వుంటాయి. ఈ పరిస్థితి దేశంలోని ఆర్థిక స్వాతంత్ర్యం లేమికీ, సంస్కారయుతమయిన ఐకమత్యానికి నిదర్శనం. క్రొత్తగా పెళ్ళయినవారిపై మామ్మ ప్రభావం, 'మామ్మ'లో చూడవచ్చు.

'ఆఖరి కోరిక', 'ఎప్పుడూ ఇంతే' అనుభూతులు ఇలా జరిగితే బాగుండదు అనే నిరాశకూ, ఇలా జరిగితే బాగుండేది అనే ఆశకు పై కథలు ఆత్మలు. అంత నిరాశా పనికిరాదు. అంత ఆశా ఆరోగ్యకరం కాదు. ఈ రెండు కథలలో ప్రదర్శితమైన భావాలు

_కీ, సంఘానికి శ్రేయస్కరం కావు.

భారత రామాయణాలలోనేకాదు, అసలు ప్రాచీన భారతీయ సంప్రదాయం బోధించేది, సోదరప్రేమలోని విశిష్టత. నేటి సమాజానికి అత్యంతావశ్యకమయింది కూడా ఈ సోదరతయే! అందరూ అన్నదమ్ములలాగా అన్యోన్యంగా వుండటం జాతి పురోగతికి అత్యవసరం! భార్యల ప్రేరణతో విడిపోయిన అన్నదమ్ములు పూర్ణహృదయాలతో, మమతానుబంధాలతో ఏకం కావటం చెప్పే కథ 'అన్నదమ్ములు'.

వస్తువైవిధ్యం మాట ఎలావున్నా, సంపుటాలుగా కథలు ప్రచురించేటప్పుడు, ఈ కథ, ఈ కథలతో చేర్చవచ్చునా లేదా అనేది, రచయితలు ప్రధానంగా ఆలోచించుకోవలసిన విషయం. ఈ సంపుటాలలో, 'ఆత్మ స్వరూపం'. పూర్తి కల్పన; 'ఎల్లోరా సుందరి,' యౌవనపు వూహ; 'అంతరార్థం,' వహాఖ్యం పై అర్థం లేని తిరుగుబాటు; చేరటంవల్ల విశిష్టత, గౌరవం ఏమీరావు. చేరకపోతేనే బాగుండేది.

'ఆడపిల్ల', 'పిచ్చివాడు' శ్రీ శాస్త్రిని భారతీయ సాహిత్యంలోనేకాదు, విశ్వసాహిత్యంలో నిలువగల అర్హతతోవున్నాయి. ఇవి మాకథలు అవి తెలుగువారు, రాష్ట్రేతరంగా, దేశేతరంగా చెప్పకొనే కథలలో ఈ రెండూ చేర్చుకోవచ్చు. ఈ రెండు కథలలో కనిపించే మానవత్వంతోపాటు, అవి ప్రదర్శించిన సామాజిక జీవితం ఉన్నతమయింది. ఆంధ్రుల జీవితాన్ని, ఈ రెండుకథలూ చిత్రించాయి. ఆడపిల్లలో మహాత్పహృదయం చక్కగా రూపొందింది. అందుకే ఆ కథకు సార్వజనీనమూ, సార్వకాలికమూ, అయిన స్థానం లభ్యమవుతుంది.

కథానికలలో కథాకథనం ఎంత ముఖ్యమో అంత ముఖ్యం ప్రారంభోపసంహారాలు. సాధారణంగా ఈ సంపుటాల కథలలో ప్రారంభ పటిష్టత అంతగా లేకపోయినా, ముగింపులు శక్తిమంతంగా వున్నాయి. ముగింపు బలంవల్ల కథలో మెరుపు వస్తుంది. కథాసాయి పెరుగుతుంది.

కథను చెప్పటంలో శ్రీ శాస్త్రికి ఒక ప్రత్యేకత వుంది. కథను పూర్తిగా చదివించే నేర్పు వుంది. పాఠకులు ఉత్సుకతతో కథలన్నీ చదువుతారు.

భావ వ్యక్తీకరణకుగానీ, స్వభావ నిరూపణకుగానీ, కథను పతాక సన్నివేశంలో పరిసమాప్తికిగానీ, పాత్రమనోగతభావప్రదర్శనకుగానీ, ఆకారవిశేషబోధకుగానీ రచయిత ఎక్కువ పదాలు వాడలేదు. తక్కువ పదాలతో విపులార్థం చెప్పగల సామర్థ్యం రచయితకు వుంది.

మానవతావాద ప్రభావంచేత, సామాజిక జీవితం రచనలో చొప్పించటంవల్ల, కథాకథనం, వస్తు గౌరవం, శైలీవిధానంవల్ల శ్రీ శాస్త్రి కథలు తెలుగు దేశంలో నిలుస్తాయి.

[శ్రీ ఇసుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి రచనలు 1. ఎప్పుడకాయింతే, 2. వినిపించని స్వరాలు. కథల సంపుటాలు. ప్రకాశకులు: రవిప్రకాశ్ పబ్లికేషన్స్ & బుక్ డిస్ట్రిబ్యూటర్స్. చిక్కడపల్లి మెయిన్‌రోడ్, హైదరాబాద్—20. వెల : ఒక్కొక్క సంపుటం. రూ. 3—00.]

—మనోరాణి.

## అందని ఆదర్శం

[నాటిక. రచయిత: శ్రీ కిలపర్తి అప్పారావు. పబ్లిషర్స్: శ్రీ పద్మావతీ పబ్లికేషన్స్, 339, గిడ్డంగి వీధి, నెల్లూరు. వెల: రూ. 1.25]

ఈనాడు ఆమూలాగ్రం ఈమూలానుంచి అసంఖ్యాకంగా వెలువడుతున్న, ఈరకం నాటికల్లో ఇది ఉత్తమ రచన కాకపోతే, ఆరు ఉత్తమ బహుమతులు వచ్చివుండేవికావు.

ఇప్పుడు ప్రతి గ్రామంలో అనేక నాటక సమాజాలు ఉన్నాయి. ప్రతి యువకుడు ముఖానికింత రంగు పులుముకొని స్టేజీమీద నాటకమాడుతున్నాడనే అనాలి. అలా ఎవరయినా ఆడటానికి అనుకూలంగా వస్తున్న నాటికలలో ఏ విషయం అయినా

ఎంతతగ్గితే అంతమంచిది.

ఆ తగ్గటం ప్రారంభమయిందగ్గర్నుంచి పాత్రలు తగ్గాయి. రంగాలు తగ్గాయి. పేజీలుకూడా తగ్గాయి. భాషతగ్గింది. భావాలకా వెసక్కుతగ్గాయి. ఆ తగ్గిన నాటికల పోటీలలో నెగ్గి బహుమతులు పొందిన నాటిక ఇది.

ఈ నాటికలో పాత్రలు నాలుగు. అందులో ఒక స్త్రీ పాత్ర. ప్రదర్శనకాలం ముప్పావుగంట. సంభాషణల చాతుర్యంవల్ల ప్రదర్శన రక్తి కట్టవచ్చు. అనాయాసంగా ప్రదర్శింపవచ్చు. ఒకేరంగం. లాడ్జి రంగస్థలం.

అన్ని చెడ్డ అలవాట్లున్నవాడు విశ్వం. లాడ్జిలో రూంబోయ్‌తో లెక్కానత్రం లేకుండా మాట్లాడాడు. రామంతో ప్రేమసంగతి చెప్పాడు. రామం నాలుగు నీతులు చెప్పాడు. విశ్వం బాగుపడాలంటే రామం తన భార్య అయిన సరళను విశ్వంతో ముడిపెట్టాల్సి వచ్చింది. ఆమె తన భార్య అని చెప్పకుండా, ఆమెను తీసుకువచ్చాడు. ఆమె, రామం భార్య అని తెలిసి, సరళ చనిపోవాలని తెచ్చుకొన్న విషం మింగి విశ్వం చనిపోతాడు.

తాగుబోతు, వ్యభిచారి, ఆడదాన్ని అనుభవించి వదిలేయాలిగానీ అక్కున చేర్చుకోకూడదన్న ఫిలాసఫీ ప్రదర్శించే విశ్వం, రామం చెప్పిన నాలుగుమాటలు విని మారిపోయాననటం సహజతకు దూరంగావుంటుంది. పెళ్లి అయ్యాక చెడ్డఅలవాట్లు వదిలివేస్తాననటం స్టేజిమీద నాటకీయంగా వుంటుందేమోకానీ జీవితంలో అసహజంగా వుంటుంది. రామం, విశ్వంలో మార్పు తేగలినంత గొప్ప సత్యాలు ఏమీ చెప్పలేదు. విశ్వం మనస్సు మార్చుకోగలిగినంత పటిష్టమైన సంఘటన ఏమీజరగలేదు.

తన భార్యను సోదరుడివంటి విశ్వంకు ఇచ్చి పెళ్ళిచేస్తానవే రామంవంటి మనిషి సంఘంలో ఉన్నాడో లేడో అనుమానంగానీ, ఊహల్లో సినిమాల్లోలాగా ఈ నాటికలో వున్నాడు.

విశ్వంతో వివాహం ఇష్టంలేని సరళ భర్తతో వంటిదగ్గరే వాదించి, తేల్చుకొని ఒప్పుకొనే లాక్కికి ఇచ్చింది. వచ్చింతర్వాత వాదనవల్ల ప్రయోజనం లేదు. వస్తూ విషం తెచ్చుకోవటంలో అర్థంలేదు. విషం పుచ్చుకోవటమే ఇష్టమయితే, ఇష్టంలేని మాట భర్త చెప్పగానే ఇంటిదగ్గరే విషం తీసుకొని వుండవలసింది.

ఆడవాళ్ళగూర్చి విశ్వం పలికే తీరు వింతగా వుంటుంది. విశ్వం మారిపోయినట్లు ప్రవర్తించటం విడ్డూరంగా వుంటుంది. మరణించటం మరీ విడ్డూరంగా వుంటుంది.

ఈ నాటిక కథావస్తువులో ప్రత్యేకత లేదు. పాత్రచిత్రణలో వాస్తవికత లేదు. రచయితకు సంభాషణ చక్కగా వ్రాసే నేర్పు వుంది. అందువల్లే నాటిక ప్రయోగార్హత పొందింది. బాగా నటించగల నటులుంటే ఈ నాటిక ప్రదర్శింపవచ్చు. ఇంతకంటే మంచి నాటికలు పోటీకి రాకపోతే ఈ నాటికకే బహుమతులు రావచ్చు.

—'రవి.'

## శారదాధ్వజము

(రచయిత : శ్రీ యండమూరి సత్యనారాయణ రావు. ప్రతులకు : ఉత్తమసాహితి, పున్నమ్మతోట—విజయవాడ—2. మూల్యము : సాదాప్రతి ఎనిమిది రూపాయలు. మేలిప్రతి పది రూపాయలు.)

డెమ్మీసైజున 380 పుటలుగల ఈ గ్రంథము తంజావూరు నాయకరాజుల కాలమునాటి తెలుగు సాహిత్య చరిత్రమును సమీక్షించునది. మరియు నిది ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారి 1965 సంవత్సరపు బహుమానమునకును పాత్రమైనది. శ్రీ యండమూరి సత్యనారాయణరావుగారు ఈ పేరుమీదుగా కంటె శ్రీవాత్సవగా ప్రసిద్ధులు.

తంజావూరున నాయకరాజులు పాలించిన కాలమున వెలసిన సంగీత సాహిత్యముల చరిత్రముతో పాటు మత, ధర్మ, సాంఘికాది పరిస్థితులను వివరించి సమీక్షించుట కీ గ్రంథ ముద్దేశింపబడినది. (1) సాహిత్యచరిత్రము—యుగవిభజనము. (2) తంజాపురాంధ్ర సరస్వతి. (3) సాహిత్యసరస్వతి. (4) సంగీత సరస్వతి. (5) కవులు—కావ్యాలు. (6) సాంఘిక స్థితిగతులు. (7) అనుబంధములు— అనుశీర్షికలుగా ఈ గ్రంథస్థ విషయము విభజింపబడినది.

ఇప్పటి ఆంధ్ర వాఙ్మయ చరిత్రమున దక్షిణాంధ్ర యుగముగా పేర్కొనబడు ఈకాలము నట్లు గాక నాయక రాజులలో శ్రీకృష్ణదేవరాయ లంతటి

వాడైన రఘునాథ నాయకుని పేరుమీద పిలువబడుటలో సామంజస్యము కలదనియు, కొందరు దీనిని క్షీణయుగమని పేర్కొనుట అవిచారమూలకమనియు సోపపత్తికముగా మొదటి శీర్షిక క్రింద శ్రీ రావుగారు నిరూపించిరి. తరువాతి గ్రంథమున కపోద్ఘాత ప్రాయమైనది రెండవ శీర్షిక. దాదాపు వంద పుటల మీఁద విస్తరించియున్న సాహిత్య సరస్వతి, ఏబది పుటలమీద వ్యాపించియున్న సంగీత సరస్వతి యను మూడు నాల్గు శీర్షికల క్రింద నడచిన గ్రంథమున నాయకరాజుల యొక్కయు, వారి యాస్థానకవుల యొక్కయు కృతులనుగూర్చి విశేషాంశములను వివరించుటతోపాటు శ్రీ రావుగారు అక్కడక్కడ ఆయా రచనలనుండి కొన్ని ఘట్టములనుకూడ ఎత్తిచూపిరి. రఘునాథ నాయకుని (1) నలచరిత్ర. (2) రామాయణము. (3) వాల్మీకిచరిత్ర; చేమకూర వేంకటపతి రచించిన సారంగధర చరిత్ర, విజయవిలాసము; ముద్దుపళని రాధికాసాంత్వనములనుగూర్చి కవులు—కావ్యాలు—శీర్షిక క్రింద విపులముగా చర్చించియున్నారు. మఱియు నాకాలపు భాషాసాహిత్యముల సాధారణ లక్షణములను సంగ్రహించి, చతుర్విధ కవితలు, శతలేఖిని, మధుర కవితలు, నాటకభాష, మతధర్మము మొదలైనవానిని యర్థవిశేషములను శ్రీ రావుగారు వివరించిపెట్టిరి. ఆ తరువాతి గ్రంథమునాటి సాంఘిక పరిస్థితులను వివరించునది. బహుగ్రంథగతములైన బహ్వంశములను పురస్కరించుకొని శ్రీ సత్యనారాయణరావుగారీ శీర్షికను శ్లాఘాపాత్రముగా నిర్వహించిరి. చిట్టచివరి యనుబంధములలో సంగ్రహముగా తంజావూరు చరిత్ర, సరస్వతీ మహల్ గ్రంథాలయము, నాటకములు - యక్షగానములు, నాటిరాజుల రసికత, వైష్ణవ మతము—ప్రపత్తి, నాటకపాత్రలు— ఈ అంశములకు సంబంధించిన విశేషములను చేర్చిరి. ఈ విధముగా ఈ శారద ధ్వజము తంజావూరు నాయకరాజుల కాలమునాటి తెలుగు సాహిత్య చరిత్రమును వివరించుచున్నది.

శ్రీ సత్యనారాయణరావుగారీ తమ గ్రంథమును కేవలము నాయకరాజుల కాలమునకే పరిమితము చేయలేదు. వారి తరువాత తంజావూరును పాలించిన మహారాష్ట్ర రాజులయొక్క ఆంధ్రభాషాసాహిత్య పరిపోషణమునుగూడ ఇందు చేర్చిరి. తెలుగువారుకాకయు, తెలుగు నేర్చుకొని, కృతులు రచించి, రచియింపించి వాఙ్మయాభివృద్ధికి దోహదముచేసిన ఆ మహారాష్ట్ర రాజులను గురించి వ్రాసి తంజావూర వెలసిన తెలుగు సాహిత్యమును సంపూర్ణముగా శ్రీ రావుగారు సమీక్షించిన వారైనారు. ఈ గ్రంథమున శ్రీ రావుగారు మంచి అభినివేశముతో చర్చించి తమ యభిప్రాయమును సుస్పష్టముగా ప్రకటించిన విషయములలో 1) రఘునాథ నాయక యుగము క్షీణయుగముకాదని. 2) శృంగార మొక్కటియే ఆకాలపు సాహిత్యలక్షణము కాదని. 3) సంగీత సాహిత్యములు రెండింటను అది మంచి ఉపజ్ఞగల కాలమని. 4) తెలుగు నాటక రచనకు ప్రారంభము జరిగిన దాకాలముననేయని. 5) రాధికాసాంత్వనములో ముద్దుపళని పనితము చాల కలదని. 6) పముఖము వెంకటకృష్ణప్ప నాయకుడాక రాధికా సాంత్వనమును వ్రాయలేదని. 7) మొత్తము మీద ఆకాలము బహుకారణములచేత స్వర్ణయుగమన దగినస్థితిలో నున్నదని—ఈ మొదలైనవి ముఖ్యమైనవి.

శ్రీ సత్యనారాయణరావుగారి విషయ సేకరణము, విభజనము, వివరణము మూడును నిర్దుష్టముగా నున్నవి. సాధారణముగా సాహిత్య విమర్శకు లంతగా నీ రచయితతో ఏకీభవింపని అభిప్రాయము లీ గ్రంథమున లేవనియే చెప్పవచ్చును. దక్షిణాంధ్ర యుగమునకు సంబంధించివచ్చిన వాఙ్మయచరిత్ర గ్రంథములలో నిది, ఒక్క తంజావూరును చుట్టుకొని ఏకదేశాత్మకముగానున్నను, ఉన్నంతలో గణనీయముగా నున్నది. శ్రీ యండమూరి సత్యనారాయణరావుగారి ఈ కృషి సాహిత్య విద్యార్థులందరకు నుపయోగపడి ఇంత లాభమునే కలిగించును.

—క్షేమేంద్ర.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by Radhakrishna
The Andhra Patrika Press 6 & 7, Thambu Chetty Street, Madras-1
Editor : S. Sambhu Prasad

Bharati May 7 th 1967 Regd No. M. 1856.

# భారతి

## ప్రకటన రేట్లు

| కవరు పేజీలు | | కాజువల్ రేట్లు | కాంట్రాక్టు రేట్లు |
|---|---|---|---|
| 4 వ కవరు పేజి | ... | రు. 175/— | రు. 150/— |
| 2 లేక 3 వ కవరు పేజి ... | | | |
| ఒకే (నలుపు) రంగు | ... | రు. 150/— | రు. 125/— |
| **లోపలి పేజీలు** | | | |
| పూర్తి పేజి | ... | రు. 125/— | రు. 100/— |
| అర పేజి | ... | రు. 65/— | రు. 55/— |
| పావు పేజి | ... | రు. 40/— | రు. 35/— |

ప్రత్యేక స్థానములకు 25 అదనం.

సం॥ వరకు వరుసగా 6 ప్రకటనలు చేయువారికి కాంట్రాక్టు రేట్లు వర్తించును.

## చందా వివరములు

| | | |
|---|---|---|
| సంవత్సర చందా | ... | రు. 12—0—0 |
| 6 మాసముల చందా | ... | రు. 6—0—0 |
| విడి ప్రతి | ... | రు. 1—0—0 |

మేనేజరు, భారతి.

మద్రాసు—1.